# వివాహం, వారసత్వం
# స్త్రీల హక్కులు



రచన:

ఉప్పల లక్ష్మణరావు





ప్రచురణ:

విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ.

1

# పూర్వచరిత్ర

హిందూ ధర్మశాస్త్రం ప్రకారం మన సమాజంలో స్త్రీల యొక్క స్థితి నికృష్టంగా వుంటూవచ్చింది. హక్కుల విషయం మరీ అధ్వాన్నంగా వుంటూండేది. బ్రిటిష్ పరిపాలన మొదటి రోజులలో న్యాయస్థానాల్లో తీర్పు చెప్పుటకుగాను ఇంగ్లీషు జడ్జీలు హిందూ ధర్మశాస్త్రానికి అప్పట్లో మన పూర్వాచారపరాయణులగు పండితులు యిచ్చిన నిర్వచనాలపైనే పూర్తిగా ఆధారపడడంచేత, హిందూధర్మశాస్త్రంయొక్క స్వరూపం దేశ కాల పరిస్థితుల ననుసరించి అభివృద్ధిచెందడానికి బదులు మరింత అభ్యుదయ నిరోధకంగా పరిణమించింది. ఇందుకుతోడు హిందూ ధర్మశాస్త్రమునకు సంబంధించిన అన్నివిషయాలూ మనపైన రాజ్యాధికారాన్ని చెలాయించుతూండిన పరాయిదేశమైన ఇంగ్లండులోని ప్రీవీకౌన్సిలువారి తీర్పులపైనే ఆధారపడియుండుటచేత, రానురాను హిందూ ధర్మశాస్త్రం పూర్తిగా స్తంభించిపోయి కోర్టు తీర్పులపైనే పూర్తిగా ఆధారపడి నిర్జీవమైన 'లా' క్రింద తయారైంది. అంతే కాకుండా, మనదేశంలో ఒక్కొక్క ప్రాంతంలో ధర్మశాస్త్రమే ఒక్కొక్క తరహాగా వుండడమూ, ఒక ప్రాంతంలోనే పలుచోట్ల పలురకములైన దేశాచారాలు, కులాచారాలు, కుటుంబాచారాలు అమలులో వుండుటవల్ల, ఈ స్థానిక వైవిధ్యాలను

కోర్టు తీర్పులు మరింత చిందరవందర చేయడంచేత హిందూ 'లా' అనేక తికమకలతోకూడి అయోమయంకింద తయారైనది. ధర్మశాస్త్రాన్ని కాలానుగుణ్యంగా మార్పుచేయుటకు గాను హిందూ వితంతువుల పునర్వివాహ చట్టము (1856), నూతన మతస్వీకారుల వివాహ విచ్ఛేదచట్టము (1866), ప్రత్యేక వివాహపుచట్టము (1872), గార్డియనుల వార్డులచట్టము (1890) మొదలైన కొత్తపద్ధతులు హిందూ 'లా'లో కొన్ని మార్పులను తెచ్చి, స్త్రీలకు సాంప్రదాయ విరుద్ధమైన కొన్ని కొత్త హక్కులను కల్పించాయి. హిందూ వితంతువులు పునర్వివాహము చేసుకునేహక్కు; తండ్రి తండ్రి, తండ్రి అన్నదమ్ములు, వీరి మధ్య కొడుకు, కూతురు, కూతురికొడుకు, తండ్రి అక్కచెల్లెళ్ళు, అక్కచెల్లెళ్ళ కొడుకులు-వీళ్ళందరికీ వారసత్వపుహక్కు కలిగించడం; భర్త వ్యవసాయేతర స్థిర చరాస్తులను భర్త తదనంతరం భార్య అనుభవించడానికి హక్కు - ఇటువంటివి కొన్ని కొత్త హక్కులు స్త్రీలకు సంక్రమించాయి. అయినప్పటికీ, నేటి వరకు అమలులోవున్న హిందూ 'లా'లో అనేకమైన లోపాలున్నాయనీ, వివాహ, వారసత్వాలలో స్త్రీలకు న్యాయమైన హక్కులు కలుగడంలేదనీ అందరూ ఒప్పుకొంటున్నదే. ఈ అన్యాయాన్ని కొంతవరకైనా సవరించాలనే ఉద్దేశంతో 1939, 1940 ప్రాంతాల్లో అప్పటి కేంద్ర శాసనసభ్యులు శ్రీమతి రాధాబాయి సుబ్బరాయన్, శ్రీ జి. వి. దేశముఖ్, శ్రీ అఖిలచంద్ర దత్తాగార్లు మూడు బిల్లులను ఢిల్లీశాసనసభలో ప్రవేశపెట్టారు. మొదటిది హిందూవితంతువులకు భర్త ఆస్తిపై దాన దమన సర్వాధికారాలతో కూడిన సంపూర్ణమైన హక్కును కలిగించేది. రెండవది బహుభార్యాత్వాన్ని నిషేధించేది. మూడవది హిందూస్త్రీలకు విడాకుల హక్కును యిచ్చేది.

ఈ బిల్లులను పరిశీలించి హిందూ న్యాయశాస్త్రాన్నంతటినీ గ్రంథస్థంచేసి ఒక సమగ్రమైన చట్టంకిందకి తీసుకొనివచ్చుటకు

గాను ప్రభుత్వం 1941 లో బి. యన్. రావు కమిటీని నియమించింది. ఈ కమిటీ హిందూ న్యాయశాస్త్రాన్ని అంతటినీ పరిశీలించి నేటి హిందూసమాజముయొక్క స్థితిని కాలానుగుణ్యాముగా మార్పు చేసే ఉద్దేశముతోను, నేడు సర్వేసర్వత్ర అభివృద్ధికరములు అని అంగీకరింపబడిన స్త్రీల హక్కులను గుర్తించే ఉద్దేశముతోను 1944 లో ఒక చిత్తుచట్టాన్ని తయారుచేయగా, యీ ముసాయిదా బిల్లును ప్రభుత్వం ప్రజాభిప్రాయాన్ని తెలుసుకోడానికి ప్రకటించింది. కాని 1945 లో ప్రభుత్వం ఈ బిల్లును శాసనసభలో ప్రతిపాదించడానికి ప్రయత్నించినప్పటికీ చివరకు విరమించుకొన్నారు. తరువాత 1948 ఏప్రిలులో రావుకమిటీచే తయారుచేయబడిన హిందూ లా చిత్తుచట్టాన్ని కేంద్ర శాసనసభలో ప్రవేశపెట్టగా 1949 లో శాసనసభల సెలెక్టుకమిటీవారిముందు పెట్టబడింది. కాని శాసనసభలోనూ, దేశంలోనూ వున్న పూర్వాచార పరాయణులూ, మితవాద నాయకులూ, హిందూ మహాసభ వారూ, కోటీశ్వరులూ, ముస్లింలీగ్ సభ్యులూ-యీ అభివృద్ధి నిరోధకశక్తుల తీవ్ర ప్రతిఘటనకు నెహ్రూ ప్రభుత్వం తల ఒగ్గవలసి వచ్చింది. ప్రధాని నెహ్రూ బిల్లును సమర్థిస్తూ యీ విధంగా అన్నారు: "ఈ హిందూకోడ్ సవరణ సమస్యమీద నా ప్రభుత్వం జయమేనా పొందాలి; కూలనైనా కూలిపోవాలి !"

స్వరాజ్య స్థాపన అయిన తరువాత, కొత్త ఎన్నికల ఫలితంగా నెహ్రూ నాయకత్వంక్రింద 1952 లో నూతన కాంగ్రెస్ ప్రభుత్వం యేర్పడిన తరువాత కాంగ్రెసు ప్రభుత్వం వెనుకటి బిల్లుకు తిరిగి మార్పులుచేసి, హిందూ వివాహమునకు సంబంధించినంతవరకు ఒక భాగముగాను, హిందూ వారసత్వమునకు సంబంధించినంతవరకు మరొక భాగముగాను విడదీసి, రెండు ప్రత్యేకపు బిల్లులను పార్లమెంటు సభలో ప్రవేశపెట్టారు. ఈ రెండు బిల్లులూ పార్లమెంటులో అనేక సవరణలకు, అనేక వడపోతలకు లోనై, ప్రతిసారి పరిశీలనలో కొంతవరకు స్త్రీలహక్కులను తగ్గించుతూ,

అభ్యుదయ కరములైన సూచనలను తిరస్కరిస్తూ తీవ్రమైన మొండి ప్రతిఘటనను యెదుర్కొనవలసి వచ్చింది. చివరికి హిందూ వివాహచట్టం 1955 మే నెలలోనూ, హిందూవారసత్వపు చట్టం 1956 జూన్ నెలలోనూ పార్లమెంటుచే అంగీకరించబడి అమలులోకి వచ్చాయి.

# 2

# హిందూ వివాహ చట్టం

ఈనాడు మన హిందూసంఘంలో జరుగుతూన్న పెళ్లిళ్లలో మూఢువంతులు వధూవరుల అన్యోన్యానురాగాలపైన గాని, ఇష్టాయిష్టములపైన గాని జరగడంలేదు సరికదా, వారి గుణగణాలేనా ప్రధానంగా చూడబడడంలేదు. ఆస్తిపాస్తులకోసం, కట్నాలు కానుకలకోసం ఆశపడి అనేకమంది తలిదండ్రులు తమ కుమార్తెలను అనర్హులైన వారి కిచ్చి పెండ్లి చేస్తున్నారు. తత్ఫలితంగా కుటుంబజీవితం దుఃఖపూరితంగా తయారౌతోంది. కొంతమంది అమాయిక యువతులు దుర్మార్గుల వలలోపడి ఇంటినుండి లేచిపోయి ఎన్నోకష్టాలకు లోనై నికృష్టజీవనం గడుపుతూ చివరికి ఆత్మహత్యలు చేసుకోవడం సంభవిస్తూంది. మరియొకవైపున కొందరు భార్యాభర్తలు యేండ్లతరబడి వైవాహికసంబంధంలేకుండా ఒకరితో ఒకరు మాటలులేకుండా లోకానికి వెరచి అలాగే కాపురాలు సాగిస్తున్నారు. ఈ పరిస్థితుల్లో స్త్రీలే అనేక దుర్ఘటనలకీ, కష్టాలకీ, బాధలకీ లోనవుతున్నారని వేరే చెప్పనక్కరలేదు.

మనదేశంలో యింతవరకూ అమలులోవున్న హిందూ 'లా' ప్రకారం ఎటువంటి దుర్భరపరిస్థితులలోనైనా విడాకులద్వారా వివాహ విచ్ఛేదం అంగీకరించబడదు. విడాకుల హక్కును అంగీకరించక పోవడంవల్ల అవినీతి ప్రబలి సమాజం మరింత అధోగతి

పాలు అవుతున్నది. హిందూస్త్రీలలో అత్యధిక సంఖ్యాకులు, పురుషులలో అనేకులు విడాకుల హక్కులకొరకు తీవ్రంగా ఆందోళన జరిపారు. తత్ఫలితంగా హిందూవివాహచట్టంలో విడాకులహక్కు, బహుభార్యాత్వ నిషేధం స్థిరపడి స్త్రీలకు న్యాయమైన కొత్తహక్కులు కలుగజేయబడ్డాయి. వివాహవిషయంలో హిందూ 'లా'లో అనేక కోర్టుతీర్పులవల్లనూ, వివిధ ఆచారసాంప్రదాయాలవల్లనూ కలిగిన కలగాపులగాన్ని యీ చట్టం చక్కబరచి అందరకూ సులభంగా గ్రాహ్యమయేటట్టు పద్ధతులను తేటతెల్లంచేస్తూంది.

హిందూ వివాహచట్టం అందరి హిందువులకీ వర్తిస్తుంది. హిందూమతం అనగా ఏమిటో యెక్కడా నిర్వివాదంగాను, నిశితంగాను చెప్పబడలేదు. అందుచేత హిందువులు ఎవరు అనే ప్రశ్నకు సమాధానం చెప్పడం కష్టంగానే వుండేది. ఈ చట్టంలో మాత్రం 'హిందువు' అనే పదానికి నిర్దిష్టంగా నిర్వచనం చెప్పబడింది. సర్వసాధారణంగా హిందువులమని చెప్పుకునేవారు వీరశైవులు, లింగాయతులు, బ్రహ్మసమాజమువారు, ప్రార్థనసమాజమువారు, ఆర్యసమాజమువారు - వీరందరూ హిందువులనే నిర్వచనం చెప్పబడింది. ఈ చట్టం హిందువులకేకాకుండా, బౌద్ధులకు, జైనులకు, సిక్కులకు కూడా వర్తిస్తుంది. అంతేకాదు-మనదేశంలో నివశిస్తూ (కాశ్మీరు, జమ్మూ ప్రాంతాలు మినహా), క్రిస్టియన్, మహమ్మదీయ, పార్శీ, యూదు మతాలకు చెందని ప్రతివారికీ వర్తిస్తుంది. ఇతర మతాల నుంచి హిందూమతంలోకి మారినవారందరూ హిందువులుగానే పరిగణించబడతారు. హిందూమతం అంటే దేవునిలో కాని, ఫలానా సూత్రాలలో కాని, సిద్ధాంతాల్లో కాని నమ్మకకలిగి వుండడం అని నిష్కర్షగా లేనందున 'నేను హిందువుడను' అని చెప్పుకునేవాడల్లా హిందువుడే. 'నేను హిందూమతస్థుడను కాను' అని ఎవడేనా అంటే, అది ఋజువు చేసుకునే బాధ్యత అతనిపైనే వుంటుంది.

హిందూ దంపతులకు జారత్వముద్వారా పుట్టిన బిడ్డలు కూడా హిందువులుగానే పరిగణింపబడతారు. ఇంతేకాకుండా తండ్రో, తల్లో హిందువులై రెండోవారు హిందూమతాంతరులై వీరికి జారత్వంద్వారా కలిగిన బిడ్డను హిందువుగానే పెంచినయెడల అట్టి బిడ్డ హిందువుగానే ఎంచబడును. ఈ విధంగా నిర్వచించడం చేత హిందువులకీ, హిందూ మతాంతరులకీ జారత్వముద్వారా పుట్టిన బిడ్డలయొక్క హక్కులు కాపాడబడ్డాయి.

అందుచేత పై చెప్పబడిన నిర్వచనాన్ని బట్టి హిందువు అన్న పదానికి విస్తృతమయిన అన్వయం చేయబడింది.

ఈ చట్టం అమలులోకి వచ్చినతరువాత యిదివరకు హిందూ 'లా'కి సంబంధించిన యే వ్యాఖ్యానంగాని, ధర్మసూత్రాలుగాని, ఆచార వ్యవహారాలుగాని ఈ చట్టానికి వర్తించవు. ఈ చట్టంలో పేర్కొనబడిన హంశములనుగురించి యిదివరలో కోర్టులలో చెప్ప బడిన తీర్పులు, శాస్త్రాలుకూడా యికముందు చెల్లవు. అందుచేత ఈ చట్టంలో వివరించిన విషయాలకు యిందులో ధృవీకరించబడిన నిర్వచనాలు, విషయాలు - యివే ప్రమాణాలు. ఇతర భాష్యాలను, యితర వ్యాఖ్యానాలను ఈ చట్టం అంగీకరించనియెడల అవి ప్రమాణాలు కావు. ఇదివరకటి పాతపద్ధతులకు ఈ చట్టం స్వస్తిచెప్తుంది.

## హిందూ వివాహం

హిందూ వివాహం చట్టసమ్మతంగా వుండడానికి ఈ క్రింద చెప్పబడిన ఆరు షరతులను విధిగా పాటించి తీరాలి.

(i) వివాహం జరిగేటప్పటికి వధూవరులు యిద్దరిలో ఏఒకరికీ కూడా సజీవియైన మరియొక భర్తకాని, భార్యకాని వుండకూడదు.

ఈ చట్టంప్రకారం బహుభార్యాత్వం, బహుభర్తృత్వం నిషిద్ధం. ఇంతవరకు మన హిందూసమాజంలో పురుషుడు తన భార్యతో సంసారం చేస్తూన్నప్పటికీ, మరో భార్యని పెళ్ళిచేసుకోవ డానికి ఏవిధమైన ఆటంకమూ లేకుండావుంది; పురుషులు యిట్టి

పెండ్లిండ్లు చేసుకోవడం సనాతనంగా ఆచారమైవుంది. అయితే చెన్నరాష్ట్రంలో 1949 లో శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారిచే ప్రతిపాదించబడి చట్టముగా చేయబడిన రెండవ వివాహ నిషేధ చట్టమున్ను, 1950 లో ఆమోదింపబడిన సౌరాష్ట్ర రెండో వివాహ నిషేధ చట్టమున్ను, 1946 లో ప్యాసైన బొంబాయి హిందువుల ద్వితీయ వివాహ నిషేధచట్టమున్నూ యీ రెండవపెళ్ళి ఆచారాన్ని నిషేధించి, అట్టి వివాహాలను శిక్షార్హములుగా నిర్ణయించాయి. ఈ హిందూ వివాహ చట్టములో చెప్పబడిన యీ షరతు హిందూ స్త్రీలందరికీ న్యాయమైన హక్కుని ప్రసాదించింది. ఈ హక్కుని అనుసరించి పురుషుడు తన భార్యకు చట్టబద్ధముగా విడాకులను యిచ్చి, ఆమెతో తన వివాహాన్ని రద్దుచేసుకుంటేనేతప్ప ఆమె బతికి వుండగా మరొక భార్యను పెళ్ళిచేసుకొనకూడదు. అట్లు చేసుకొనినయెడల ఆ వివాహము నిషిద్ధముగనుక చెల్లనేరదు. ఇదే విధంగా స్త్రీకూడా భర్త జీవించి యున్నప్పుడు అతనికి చట్టసమ్మతంగా విడాకులనిచ్చి వివాహాన్ని రద్దుచేసుకొనకుండా రెండవ భర్తను పెళ్ళిచేసుకొన్నయెడల ఆ పెళ్ళి నిషిద్ధము గనుక చెల్లనేరదు. భార్యగాని, భర్తగాని 7 సంవత్సరములకుపైగా యే విధమైన జాడ తెలియకుండా అదృశ్యం అయిన యెడల అట్టి వ్యక్తి న్యాయశాస్త్రదృష్ట్యా చనిపోయినట్లే భావించబడును. అట్టి సందర్భంలో భర్తగాని, భార్యగాని రెండవసారి పెండ్లి చేసుకొనిన ఆ పెండ్లి శాస్త్రసమ్మతమై చెల్లును. ఏడేండ్లు జాడ తెలియనటువంటి వ్యక్తి బతికివున్నట్లు ఎవరేనాసరే అన్నయెడల ఆ విషయం నిర్ధారణచేసే బాధ్యత అతనిమీదే వుంటుంది. (సెక్షను 108, ఇండియన్ ఎవిడెన్స్ ఆక్టు 1872).

(ii) వధువుకాని, వరుడుకాని వివాహం జరిగేటప్పటికి వెర్రివారుకాని, పిచ్చివారుకాని అయివుండకూడదు.

(iii) పెళ్ళినాటికి వరునికి 18 సంవత్సరాలున్ను, వధువుకి 15 సంవత్సరాలున్ను వయస్సు పూర్తిఅయివుండాలి. వయస్సు

విషయమై పార్లమెంటులో చర్చజరిగినప్పుడు లోక్ సభలో వరునికి 20 సంవత్సరాలున్నూ, వధువుకి 18 సంవత్సరాలున్నూ వుండాలని నిర్ణయించారు. కాని రాజ్యసభవారు వరునికి 18 సంవత్సరాలు, వధువుకి 15 సంవత్సరాలు అని తగ్గించారు. తదుపరి లోక్ సభ కూడా యీ తక్కువ వయస్సునే అంగీకరించారు. పెళ్ళినాటికి వరునికి 20 సంవత్సరాలు, వధువుకి 18 సంవత్సరాలు వుండేటట్లే చట్టం నిర్ణయించి వుంటేనే సమాజానికి అభివృద్ధికరంగా వుండేది.

(iv) వధూవరులమధ్య నిషిద్ధ బంధుత్వం వుండకూడదు. అనగా అన్నదమ్ముల, అక్కచెల్లెళ్ళ వివాహం నిషిద్ధం. మేనమామ మేనకోడలిని వివాహం చేసుకోకూడదు. మేనత్తను మేనళ్ళుడు పెళ్ళిచేసుకోకూడదు. అన్నదమ్ముల పిల్లలమధ్య, అక్కచెల్లెళ్ళ పిల్లలమధ్య పెళ్ళి వీలులేదు. పినతల్లి కూతురిని, పినతల్లి కొడుకుని చేసుకోకూడదు. అక్కకూతురిని, అక్కకొడుకుని చేసుకోకూడదు. మన ఆంధ్రదేశంలో మేనరికం చాలా ప్రబలంగా వాడుకలో వుంది. కొన్ని వర్ణాల్లో మేనరికపు సంబంధం తప్పిన యెడల చాలా తప్పుకూడా పడతారు. ఇట్టి దగ్గర సంబంధాలను నిషేధించడం చాలా మంచిదనడంలో యెట్టిసందేహం లేదు. ఆంధ్ర మహిళాలోకం ఈ ఆచారాన్ని తీవ్రంగా ఖండించింది. అయినా యీ చట్టం ప్రకారం యే వర్ణంలోకాని, కులంలోకాని అట్టి నిషిద్ధ బాంధవ్యాల మధ్య వివాహాలు ఆచారసిద్ధంగా అమల్లో వుంటే వాటికి తప్పులేదన్నారు. ఈ ఆచారాన్ని పూర్తిగా నిషేధించి వుంటే సంఘశ్రేయస్సుకీ, అభ్యుదయానికీ దోహదం ఇచ్చివుండేది.

(v) వధూవరులు సపిండులు కాకూడదు.

హిందూ ధర్మశాస్త్రంలో ఎవరు సపిండులు అనే మీమాంస అనాదిగా వస్తూంది. మితాక్షరపద్ధతి ప్రకారం సపిండత్వము రక్త సంబంధంపైన ఆధారపడివుండగా, దాయబాగపద్ధతి ప్రకారం సపిండత్వము పితృకర్మలు, తద్దినాలుపెట్టే అధికారంపై ఆధారపడి వుంది. ఈ మీమాంస ఎలాగవున్నా, ఈ చట్టంమాత్రం సపిండత్వం

తండ్రివైపు ఐదుతరాలనీ, తల్లివైపు మూడుతరాలనీ నిర్వచనం చేసింది. అందుచేత బంధువులమధ్య సంబంధాలు చేసుకోడానికి ఎక్కువ అవకాశాన్ని కల్పించింది. అయితే యింతకంటే దగ్గిర సంబంధంగల సపిండులమధ్య వివాహాలు చేసుకునే ఆచారం ఆయా వర్ణాలలోనూ, కులాలలోనూ అమలులోవుంటే ఆ ప్రకారం చేసుకోవడానికి యీ చట్టం అనుమతించింది. ఈ విధంగా సపిండులమధ్య కులాచారం, కుటుంబాచారం ఒప్పుకుంటున్న మాత్రాన యిట్టి అధునాతనపుచట్టం వీటిని అనుమతించడం సంఘానికి శ్రేయోదాయకం కాదేమో అనిపిస్తుంది.

(vi) వధువుకు పెళ్ళినాటికి 18 సంవత్సరములు నిండని యెడల వివాహమునకు ఆమె సంరక్షణకర్తయొక్క అనుమతిని పొందివుండాలి.

ఈ చట్టంక్రింద 18 సంవత్సరాల లోపువున్న వధువు వివాహానికి ఆమె సంరక్షణకర్తయొక్క అనుమతి విధిగా అవసరం. అట్టి అనుమతి పొందకుండా వివాహం జరిగినా ఆ వివాహం చెల్లనేరదు. ఏ కారణం చేతనైనా ఆమెకు సంరక్షణ కర్తలు లేనియెడల, 18 ఏళ్ళ వయస్సు లోపునవున్నా అట్టి అనుమతి లేకుండానే ఆమె వివాహాన్ని చేసుకోవచ్చు. సంరక్షణ కర్త వుండికూడా అతని అనుమతిని పొందందే వివాహము జరుగబోవునప్పుడుకాని, అసలు సంరక్షణకర్త లేనేలేనప్పుడుకాని, వధువుయొక్క శ్రేయస్సుదృష్ట్యా ఇంజక్షను ఉత్తరువు జారీచేసి వివాహాన్ని ఆపుచేయడానికి కోర్టువారికి పూర్తి అధికారంవుంది.

## హిందూ వివాహపు తతంగం

వధూవరులలో ఎవరియొక్క కులాచారం ప్రకారమైనా సరే వివాహతతంగం జరిగినయెడల అట్టి వివాహం శాస్త్రసమ్మతమే. అట్టి తతంగంలో సప్తపది లాంఛనం జరిగినయెడల, వధూవరులు యేడవపాదం వేయడం పూర్తికాగానే వివాహం జరిగినట్లు, అప్పటినుంచి వివాహసంబంధం ఏర్పడినట్లు భావించబడుతుంది.

హిందూవివాహాలు జరిగినట్లు రుజువు పరచడానికి వీలుకలిగించేటందుకు రాష్ట్రప్రభుత్వాలు హిందూ వివాహపు రిజిష్టరు అనే రికార్డును యేర్పాటుచేసి అందులో వివాహపు వివరాలను నమోదు చేయడానికి అవుసరమైన నిబంధనలను చేయవచ్చును. రాష్ట్రప్రభుత్వాలకు అవుసరమనితోచిన పక్షమందు రాష్ట్రములో జరిగిన హిందూ వివాహాలన్నీ అట్టి రిజిష్టరులో నిర్బంధముగా నమోదు చేయబడేటట్టున్ను, ఆ విధముగా వివాహమును నమోదుచేయని యే వ్యక్తికైనా ఇరవైఐదురూపాయలు జుల్మానా విధించుటకున్ను కోర్టుకు అధికారం యివ్వబడింది. ఇందు విషయమై యేర్పరచిన నిబంధనల ననుసరించి రాష్ట్రప్రభుత్వం నియమించిన రుసుము చెల్లించిన యెడల ఆ రిజిష్టరునుండి సరిగా ధృవపరచబడిన నకలును తయారుచేసి కావలసిన వారికి యివ్వడానికికూడా యేర్పాటులను చేయవచ్చును. అయితే ఆవిధంగా వివాహపు రిజిష్టరులో వివాహాన్ని నమోదుచేయనంత మాత్రాన ఆ వివాహంయొక్క చెల్లుబడికి యేమాత్రం భంగంకలుగదు.

## దాంపత్య పునరుద్ధరణ

తగిన కారణం లేకుండా భర్త తన భార్య సాంగత్యాన్ని విడనాడినా, లేక భార్య తన భర్త సాంగత్యాన్ని విడనాడినా ఆ వియోగమువల్ల నష్టపడినవారు దాంపత్య పునరుద్ధరణను అనగా సంసారాన్ని నిలబెట్టమని కోరుతూ జిల్లాకోర్టులో పిటీషను దాఖలు చేసుకోవచ్చును. పిటీషనులో ఉదహరించిన సంగతులు సత్యమని, న్యాయమని కోర్టువారికి తోచినయెడల దాంపత్యాన్ని పునరుద్ధరించుతూ అనగా సంసారాన్ని తిరిగి సాగించవలసినదని డిక్రీ యివ్వవచ్చును.

అయితే కోర్టుద్వారా దాంపత్య విచ్ఛేదానికిగాని, వివాహాన్ని రద్దుపరచడానికిగాని, విడాకులు పొందడానికిగాని, యేకారణ

ణాలను ఉదహరించవలసి వుంటుందో ఆ కారణాలేతప్ప యీ దాంపత్య పునరుద్ధరణ పిటీషనును ప్రతిఘటిస్తూ ప్రతివాది యిచ్చే తన వాఙ్మూలములో యితర విషయాలను వేటినీ ప్రతివాది ఉద హరించకూడదు.

భర్త భార్యమీద పిటీషను దాఖలు చేశాడనుకుందాం, అకారణంగా తన సాంగత్యాన్ని వదులుకొని లేచిపోయిందని. అప్పుడు భార్య తన ఉత్తర వాఙ్మూలంలో "సబబైన కారణా లని నిరూపించవలసివుంటుంది." "సబబైన కారణాలు" అంటే సామాన్య బుద్ధి, జ్ఞానం గలవ్యక్తి తన క్షేమందృష్ట్యా తీసుకొనే జాగ్రత్తఅయివుండాలి. ఇంక ఆ భర్తతో పరువు, మర్యాద, మానం వున్న మరెవ్వరైకూడా వేగలేనంతటి పరిస్థితుల్లో అతని సాంగత్యం వొదులుకొనవలసివచ్చింది అని నిరూపించవలసి వుంటుంది. ఒక దావాలో భార్య తన సాంగత్యాన్ని అకారణంగా వొదిలిపెట్టింది. అందుచేత దాంపత్యాన్ని పునరుద్ధరించవలసిందని కోర్టులో పిటీషను వేశాడు. విచారణలో - అసలు భార్యను మోసగించి తను బ్రహ్మచారిని అని అబద్ధాలుచెప్పి మభ్యపెట్టి భర్త పెళ్లిచేసుకున్నాడని రుజువైనందువల్ల కోర్టువారు భర్త పిటీషనును తోసివేశారు. (రుక్మిణీఅమ్మాళ్, వ్య, టి. ఆర్. ఎస్. చారి, ఎ. ఐ. ఆర్, 1935 చెన్నపట్నం 616). అదేవిధంగా భర్త తన భార్యను కొంతకాలంతరబడి పోషించకుండా వదిలిపెట్టేసి తరవాత భార్యమీద దాంపత్య పునరుద్ధరణకోసం పిటీషనువేస్తే, ఆ పిటీషనుని కోర్టువారు తోసివేస్తారు. అలాగనే భర్తతో నివ సించవలిసింది అని కోర్టువారు ఉత్తరువు జారీచేస్తారే అనుకుందాం. అట్టి పరిస్థితుల్లో భార్య భర్తదగ్గరికి వెళ్లినట్టయితే ఆమె ఆరో గ్యానికీ, ఆమె క్షేమానికీ ప్రమాదం సంభవిస్తుందేమో అని కోర్టు వారు అభిప్రాయపడితే కోర్టువారు ఎంతమాత్రం దాంపత్యాన్ని పునరుద్ధరిస్తూ ఆజ్ఞాపించరు. (గేనూనియా, వ్య, బేగంబీబీ, 148 ఐ. సి. 309-ఎ. ఐ. ఆర్. 1933 రంగూను 322).

దాంపత్య పునరుద్ధరణని కోరుతూ భార్యకాని, భర్తకాని పిటీషను వేయవచ్చు. ఆ పిటీషనును ప్రతిఘటించడానికిగాను కోర్టుద్వారా దాంపత్య విచ్ఛేదాన్ని కోరడానికిగాని, విడాకులు కోరడానికిగాని యేయే కారణాలను నిరూపించవలసి వస్తుందో సరిగ్గా ఆ కారణాలని నిరూపించ గలుగుతేనే కోర్టువారు ప్రతివాది పిటీషనుపైన తీర్పు యిస్తారు. ఆ కారణాలు యేమిటంటే రెండు సంవత్సరాలకు పైబడి ఒకేవిధంగా వరుసగా ప్రతివాదిని వదలిపెట్టేసినట్టూ, ప్రాణానికి అపాయం కలిగేటంతటి క్రౌర్యంతో హింసపాలు చేస్తూన్నట్టూ, లేదా తీవ్రమైనటువంటి కుష్టురోగంతో గాని, సుఖరోగాలతో గాని వారి బాధపడుతూన్నట్టు, మతిభ్రమ కలిగివున్నట్టు, లేదా వెనకటి భర్తగాని, భార్యగాని సజీవులై వున్నట్టు లేక నిషిద్ధ బాంధవ్యమున్నట్లు, లేదా పిచ్చి, వెర్రి, నపుంసకత్వం వున్నట్టు, లేక సంరక్షణకర్తయొక్క అనుమతి లేదని మభ్యపెట్టి అనుమతి సంపాదించడం, లేక భార్యయొక్క అనుమతి లేకుండా పెళ్లిజరిగివుండడం, లేక జారత్వము, లేక అన్యమతంలో కలిసిపోవడం, లేదా ప్రపంచాన్ని వదిలిపెట్టేసి సన్యాసి అవడం, లేక ఏడుసంవత్సరాలకు పైగా జాడ తెలియకుండా వుండడం, వివాహమప్పటికి భార్య గర్భిణిగా వుండడం, దాంపత్య పునరుద్ధరణను వ్యతిరేకించడానికి కారణాలు. కోర్టుద్వారా భార్యాభర్తలు వేరుపడుటకు కోరడానికి కాని, వివాహం రద్దుపరచి విడాకులను కోరడానికికాని యివే కారణాలను నిరూపించవలసి వుంటుంది.

## కోర్టుద్వారా భార్యాభర్తలు వేరుపడుట

వివాహం ఈ చట్టానికి ముందు జరిగినాసరే, తరువాత జరిగినాసరే భార్యకాని, భర్తకాని వేరుపడుటకు కోరుతూ జిల్లా కోర్టులో పిటీషను దాఖలుచేయవచ్చు. దాంపత్యంనుంచి వేరుపడుటకు యీ క్రింది కారణాలలో యేదేనా ఒక కారణాన్ని పిటీషనరు రుజువుపరచగలిగితే కోర్టువారు పిటీషనరుకు అనుకూలంగా డిక్రీ యిస్తారు:

(i) పిటీషను దాఖలుచేసేముందు వరుసగా రెండు సంవత్స రాలనుంచీ భర్త భార్యనిగాని, భార్య భర్తనిగాని వదలివేసిన యెడలను; లేక

(ii) పిటీషనరు రెండవవారితో యిక దాంపత్యం సాగించిన యెడల తనకు ప్రమాదం సంభవించగలదు అనే సకారణమైన భయాన్ని తన మనసులో కలగడానికి తగినంత క్రూరంగా తన యెడల రెండవవారు ప్రవర్తించిన యెడలను; లేక

(iii) పిటీషను దాఖలు చేయడానికి మునుముందు ఒక సంవత్సరంనుంచీ తీవ్రమైనట్టి కుష్టురోగముతో బాధపడుతూన్నప్పుడు; లేక

(iv) పిటీషను దాఖలు చేయడానికి మునుముందే రెండవ వారు సుఖరోగముతో బాధపడుచూ, అట్టిరోగము పిటీషనరువల్ల రెండవవారికి కలుగకుండా వుండి, రెండవవారివల్ల పిటీషనరుకు ఈ రోగము కలగడానికి అవకాశము వున్నప్పుడున్ను; లేక

(v) పిటీషను దాఖలు చేయడానికి రెండు సంవత్సరాలకు ముందునుంచీ ఒక్కలాగు మతిభ్రష్టుడు అయివుండడం; లేక

(vi) వివాహం అయినతరువాత రెండవవారు పిటీషనరుతో కాక, పర పురుషునితోగాని, పర స్త్రీతోగాని లైంగిక సంపర్కం కలిగివుండినప్పుడున్ను.

ఈ సందర్భంలో ఒకటి రెండు విషయాలను గమనించవలసి వుంది.

మొదటిది : వివాహం యీ చట్టానికి వెనుకైనా ముందైనా కూడా కోర్టుద్వారా దాంపత్యంనుండి వేరుపడుటకు కోర వచ్చును. ఇంతేకాదు. వివాహం యెలాంటి పద్ధతిప్రకారం జరిగినా సరే, యే తతంగం అనుసరించి జరిగినాసరే, కులాచారప్రకారం జరిగినాసరే హిందూ వివాహం అయితేచాలును, కోర్టులో పిటీషను వేసి డిక్రీనిపొంది, దాంపత్యంనుండి వేరుపడవచ్చును.

రెండవది: భర్త భార్యనుగాని, భార్య భర్తనుగాని 'వదలివేయడం' అంటే కొంతకాలంగా భార్యాభర్తలుగా సంసార జీవనం చెయ్య నిరాకరించడం - అదిన్నీ రెండవవారి యిష్టానికి వ్యతిరేకంగానో, వారి అనుమతి పొందకనో, సరియైన కారణం లేకుండానో అని నిర్వచనం. ఎవరు వదిలివేశారు, ఎవరు లేచి పోయారు అనేది ప్రశ్న కాదు. దాంపత్యంనుండి వేరుపడేతలంపు ఎవరికి కలిగి,ఎవరు వైవాహికజీవనాన్ని వాస్తవంగా అంతంచేశారో, వారు వదలేసినట్టు అవుతుంది. ఎవరైతే వదలివేస్తారో వాళ్ళే యింటి నుంచిలేవడం సామాన్యంగా జరుగుతూంటుంది. అయినా లేచి వెళ్ళిపోవడం ముఖ్యంకాదు. వైవాహికజీవనాన్ని సాగకుండాచేసిన వాళ్ళెవరో, వారు 'వదలివేసిన' వాళ్ళవుతారు (ఎ.ఐ.ఆర్. 1956 మద్రాసు 415). ఉదాహరణకి ఇంట్లో భర్త పరస్త్రీనివుంచుకుని, ఆ పరస్త్రీతో జారత్వం చేస్తూంటే, భార్య యింటినుంచి వెళ్ళి పోయింది. అప్పుడు భర్తే భార్యను వదలిపెట్టేశాడు అని కోర్టు వారు తీర్పుచెప్పారు. (రోయి (బారి) స్త్రీ వ్య., బస్సింగనాయక్, ఎ. ఐ. ఆర్. 1935 చెన్నపట్నం 541).

మరొక ఉదాహరణ: భర్త భార్యతో 1932 లో ఒకయింటిలో నివసిస్తూ, తను మాత్రం వేరేగదిలో వుండేవాడు. పక్షం రోజులు యిలా నివసించిన తరువాత భార్యను వదలేసి మళ్ళీ యింటికి వచ్చే వుద్దేశం లేకుండా, మరొక స్త్రీతో వుండడానికి వెళ్ళిపోయాడు. అందుచేత 1932 లో భర్త భార్యను వదలిపెట్టేసినట్టే అయింది. తరువాత 1935 లో భార్య భర్తతో కలిసి వుండడానికి యిష్టపడి భర్తకి తన ఉద్దేశాన్ని తెలియజేసింది. భర్త అందుకు సరే నువ్వు బొంబాయి వచ్చి నా యింట్లో వుండొచ్చు. కాని తన స్నేహితురాలితో మాత్రం యేమీ కలుగజేసుకోకూడదు అని భార్యతో షరతుపెట్టాడు. అందుకు భార్య వొప్పుకుని బొంబాయి వచ్చి భర్త యింట్లో వేరే ఒక గదిలో నివసిస్తూం డెను. కాని తన భర్తను కలుసుకోవడానికి అతని స్నేహితురాలు

అతని యింటికి వచ్చినప్పుడల్లా భార్య అభ్యంతరం పెట్టేది. దాని మీదట దాంపత్యం వదలిపెట్టడానికి కోరుతూ భార్య దావా వేసింది. ప్రశ్న యేమి వచ్చిందంటే - 1932లో భర్త భార్యని వదలిపెట్టేశాడు. కాని భార్య 1935 లో భర్తయింటికి వచ్చింది కదా, రెండేళ్లు వరసగా వదలివేయడం జరిగిందా, జరగలేదా అని. భర్త తన భార్యని తనయింటికి రమ్మన్నాడేకాని, ఆత్మగౌరవంగల యే భార్యకూడా ఒప్పుకోవడానికి వీలులేని షరతులు విధించి రమ్మనమన్నాడు కాబట్టి, 1932 నుంచి 1935 కు మధ్య యే అడ్డు లేకుండా అంతకాలం భర్త భార్యని వదలిపెట్టినట్టే అయిందని కోర్టువారు తీర్పుచెప్పారు (నెల్లీ ఓహారా ఫిడో, వ్య, ఆస్టిన్ హెన్రీ ఫిడో, ఎ. ఐ. ఆర్. 1938 బొంభాయి 425).

మూడవది: క్రూరత్వం అంటే ప్రాణానికికాని, శరీరానికి కాని ప్రమాదం కలగడం, లేక కలుగబోతుందని ఆందోళనపడ డానికి తగినకారణం వుండడం. కఠినమైన ప్రవర్తనకూడా క్రూరత్వం అనిపించుకోవచ్చు. ఒకేఒక్కపర్యాయం క్రూరంగా ప్రవర్తించినా, మళ్ళీ యెక్కడ రెండోపర్యాయం క్రూరప్రవర్తన జరుగుతుందో అనే భయాందోళన కలగడంవల్ల క్రూరప్రవర్తకిందకే వస్తుంది. శరీరానికి ప్రమాదం కలగనప్పుడు, మనస్సుకు ఎంతబాధ కలిగించే టట్టు ప్రవర్తించినా పద్ధతులదృష్ట్యా క్రూరత్వంకిందికి రాదు. కోపముగాను, కఠినంగాను, దురుసుగాను, అమర్యాదగాను మాట్లాడ్డం, ఎత్తిపొడుపులు, దెప్పుడుమాటలు యివి ఎన్నివున్నా శరీరానికి ప్రమాదం కలగనంతవరకు క్రూరత్వం అనిపించుకోవు.

# 3

# వివాహం రద్దు: అసత్య వివాహాలు

శాస్త్రీయ మైనటువంటిన్నీ, సక్రమమైనట్టిన్నీ హిందూ వివాహానికి ఈ చట్టం ఆరు షరతులను విధిస్తూంది. చట్టంయొక్క 5 వ సెక్షను ప్రకారం పెళ్ళి జరిగేటప్పటికి వధూవరులలో ఎవ్వరికి కాని బ్రతికియున్న భార్యకాని, భర్తకాని వుండకూడదనీ, పెళ్ళినాటికి పిచ్చి, వెర్రివారై వుండకూడదనీ, వరునకు 18 సంవత్సరాల వయసు, వధువుకు 15 సంవత్సరాలు పెళ్ళినాటికి నిండివుండాలనీ, వా రిరువురి మధ్య నిషిద్ధమైన బంధుత్వము వుండకూడదనీ, వారు సపిండులు కాకుండా వుండాలనీ, వధువుకి 15 సంవత్సరాలు నిండ కుండావుంటే ఆమె వివాహానికి సంరక్షణకర్త యొక్క అను మతి అవసరం అనీ, యిదివరకే చెప్పాను. ఈ ఆరు షరతుల్లో మొదటి షరతు – అనగా వధువుకు జీవించియున్న భర్త వుండ కూడదని, వరుడికి జీవించియున్న భార్య వుండకూడదని – లేకి నాల్గవషరతు – అనగా; వరుని మధ్య వధువుమధ్య నిషిద్ధబాంధవ్యం వుండకూడదని, లేక ఐదవషరతు – అనగా వధూవరులు యిద్దరూ సపిండులు కాగూడదు – అన్న యీ మూడు షరతుల్లో యే ఒక్క షరతుని అతిక్రమించి వివాహం జరిగినప్పటికీ అశాస్త్రీయమైన వివాహం అవుతుంది కాబట్టి, వివాహము అని అనిపించుకోదు. ఆ వివాహము అశాస్త్రీయమే కాకుండా ఆ వివాహము జరగనట్టే

భావించబడుతుంది. చట్టరీత్యా, పద్ధతులరీత్యా అది అశాస్త్రీయం గనుకనూ, ఆ వివాహం జరగనట్టే లెక్క కనుకనూ ఆ వివాహాన్ని రద్దుచేయించుకోడానికి కోర్టుకి వెళ్ళనవసరం లేదు.

అలాంటి వివాహం జరిగితే అది వివాహసంస్కారం కానే కాదు కాబట్టి - ఆ వివాహము అబద్ధపు వివాహము - వృత్త నాటకము అన్నమాట. అందుచేత ఆ వ్యక్తులు మళ్ళీ మరెవరినైనా సరే పెళ్ళిచేసుకోడానికి యెట్టి అభ్యంతరంలేదు.

## వివాహం రద్దు : నిషిద్ధ వివాహము

ఐతే డిస్ట్రిక్టుకోర్టులో పిటీషను పెట్టుకుని ఆ వివాహాన్ని రద్దుచేయించుకోవడం మంచిది. లేనియెడల పిల్లలుపుట్టితే వారు శాస్త్రసమ్మతంగా పుట్టినవారుగా పరిగణింపబడరు. ఇది చాలా ముఖ్యము. ఈ పైకారణాలవల్ల వివాహాన్ని రద్దు చేయించుకొనడానికి ఆ వరుడేనా పిటీషను దాఖలుచెయ్యాలి, లేక వధువేనా పిటీషను దాఖలుచెయ్యాలి. తదితరులు ఎవ్వరు పిటీషనువేసినా కోర్టువారు ఆ పిటీషనుని అంగీకరించరు.

ఇక్కడ ఒక విషయంవుంది. ఇది యీ చట్టం అమలులోకి వచ్చిన తరువాత జరిగిన వివాహాలకే వర్తిస్తుంది కాని, అంతకు ముందు జరిగిన వివాహాలకు వర్తించదు.

పిటీషనరు యేకారణం ప్రకారం వివాహం చెల్లనేరదు అని ఉదహరిస్తారో, ఆ కారణాన్ని ఋజువుచేసుకొనగలిగితే కోర్టువారు వివాహం అసత్యవివాహం అని నిర్ణయించి వివాహాన్ని రద్దుచేస్తారు. కోర్టువారిచేత రద్దుచేయించుకొన్నయెడల పిల్లలుంటే పిల్లలకు న్యాయసమ్మతముగా పుట్టిన పిల్లలు అన్నమాట దక్కుతుంది. అప్పుడు కోర్టువారు ఆ వివాహం అసత్యవివాహం అయినప్పటికి నిషిద్ధవివాహం అని తీర్పుచెప్పి, పిల్లలుంటే పిల్లలను వారసులని నిర్ణయిస్తారు. లేకపోతే ఆ పిల్లలు న్యాయసమ్మతమైన బిడ్డలు కారన్న మచ్చ వాళ్లమీద వుండిపోతుంది.

## వివాహం రద్దు - విసర్జనీయమైన వివాహాలు

వెనుక వివరించిన మూడు షరతులను ఉల్లంఘించి జరిపిన తతంగం అసలు వివాహమే అనిపించుకోదు. కనుక ఆ కారణాన్ని బట్టి ఆ వివాహం రద్దు అయిపోతుంది. వివాహాన్ని రద్దుపరచమని పిటీషనుద్వారా కోర్టువారిని కోరి వివాహాన్ని రద్దుపరచుకోడానికి యింకా మరికొన్ని అవకాశాలను ఈ చట్టం కలిగిస్తూంది. ఆ కారణాలు సెక్షను 12 లో వివరించబడ్డాయి. ఈ సెక్షనులో వివరించిన కారణాన్ని ఉదహరిస్తూ కోర్టులో పిటీషను దాఖలుచేసే కోర్టువారి ఎదుట అవి నిజమని రుజువుపరిస్తే కోర్టువారు ఆ పిటీషనును అంగీకరించి ఆ వివాహాన్ని రద్దుపరుస్తారు. ఈ సెక్షనులోవున్న నిబంధనలు యేమిటంటే :

ఈ చట్టం అమలులోకి వచ్చిన తరువాత జరిగిన వివాహమైనాసరే, చట్టం చేయబడక పూర్వం జరిగిన వివాహమైనాసరే :

(i) వివాహం జరిగే సమయమందు పురుషుడు నపుంసకుడై వుండి పిటీషను దాఖలుచేసేసరికి కూడా నపుంసకుడై వుంటేనూ, స్త్రీ దాంపత్యానికి ఉపయోగపడకుండా వుండి పిటీషను దాఖలు చేసేసరికి దాంపత్యానికి ఉపయోగపడకుండా వుండినప్పుడు; లేదా

(ii) ఈ చట్టములో వివాహానికి సెక్షను 5 (ii) లో నిర్ణయించిన షరతును - అనగా వివాహకాలంనాటికి వధువుకాని వరుడుకాని పిచ్చి, వెర్రి లేకుండా వుండాలి అనే షరతును ఉల్లంఘించి వివాహం జరిగిన యెడలను; లేదా

(iii) సెక్షను 5 ప్రకారమూ వధువు 15 సంవత్సరాల వయస్సుకు లోపుగావుండి వివాహానికి అవసరమైనట్టి తన సంరక్షణకర్తయొక్క అనుమతి లేనప్పుడున్నూ, లేదా పిటీషనరైన వధువు వివాహసమయమందు 18 సంవత్సరాలు దాటివుండి తన అనుమతి లేనిదే తనకు వివాహం జరిగినప్పుడున్నూ, లేదా వధువు అనుమతి కాని, తన సంరక్షణకర్త అనుమతిగాని బలవంతంగానైనా, మోసం

చేసిన్నైనా పొందిన యెడలనున్నూ; లేదా పిటీషనరైన వరుని అనుమతి బలవంతంగాగాని, మోసముచేసిగాని పొందిన యెడల నున్నూ; లేదా

(iv) ప్రతివాది వివాహంనాటికి పిటీషనరుచే గాక మరి యే యితర వ్యక్తిచేగాని గర్భిణీగా వున్నా; కోర్టువారు వివాహాన్ని అశాస్త్రీయమని నిర్ణయించి వివాహం జరిగినప్పటికీ వివాహాన్ని రద్దుచేస్తూ డిక్రీ యివ్వవచ్చును.

అయితే, వరునియొక్క అనుమతిగాని, వధువుయొక్క లేక ఆమె సంరక్షణకర్తయొక్క అనుమతి లేనప్పుడుగాని, అనుమతి బలవంతము, మోసమువల్ల పొందిన కారణంక్రింద పిటీషను దాఖలుచేసిన యెడల :

(i) బలవంతం ఆగిపోయిన సంవత్సరం లోపునగాని, మోసము కనుగొనబడిన తరువాత ఒక్కసంవత్సరము లోపునగాని పిటీషను దాఖలు చేసితీరాలి. సంవత్సరం గడువు దాటిపోతే పిటీషను చెల్లనేరదు.

(ii) బలవంత పరిస్థితులు ఆగిపోయిన వెంటనే లేక మోసం కనుగొనబడిన వెంటనే తన పూర్తి అంగీకారముతో భర్త భార్యతో కాని, భార్య భర్తతోకాని భార్యాభర్తలుగా జీవించకూడదు. నిర్బంధ పరిస్థితులు తీరిపోయిన తరువాతగాని, మోసం తెలుసుకున్న తరువాతగాని బుద్ధిపూర్వకంగా వైవాహిక జీవనం చేసి యుండిన్నీ, పిటీషను వేస్తే పిటీషను ఎంతమాత్రం చెల్లదు.

మరియొక ముఖ్యమైన విషయం: పిటీషనులో వధువు వివాహ సమయమప్పుడు తనచేగాక యితరులచే గర్భిణిగా వుండెను అనే కారణాన్ని భర్త ఉదహరించిన యెడల :

(i) వివాహమప్పుడు భర్తకు ఆ విషయము తెలియకుండా వుండి వుండాలి; మరియు

(ii) ఈ చట్టముకు పూర్వమే వివాహం జరిగివుంటే, చట్టం అమలులోకి వచ్చిన సంవత్సరంలోపుగాను; వివాహం ఈ చట్టము తరువాత జరిగివుంటే, వివాహం జరిగిన తేదీనుండి సంవత్సరం లోపుగాను; మరియు

(iii) పిటీషనులో ఉదహరించబడిన సంగతులు పిటీషనరుకి - అనగా భర్తకి తెలిసినప్పటినుండి తన భార్యతో తన యిచ్ఛాపూర్వకంగా వైవాహిక సంబంధం కలిగి వుండకూడదు.

భార్య వివాహమప్పుడు మరి ఒకరివల్ల గర్భిణీగా వున్నట్టు తెలిసికూడా పై సంవత్సరపు గడువుకాలం దాటిన తరువాత వివాహం రద్దుచేయమని పిటీషను దాఖలుచేసినా, తెలిసిన తరువాత కూడ ఆమెతో వైవాహికసంబంధం కలిగివుండినా పిటీషను చెల్ల నేరదు.

పై చెప్పిన విసర్జనీయమైన వివాహాలు కోర్టులో పిటీషను వేసి గెలిస్తేనేకాని ఆ వివాహాలు రద్దుకావు.

## వివాహవిచ్ఛేదము - విడాకులు

"హిందూ న్యాయశాస్త్రంలో బి. యన్. రావు కమిటీవారు తీసుకువచ్చిన ముఖ్యమార్పులలో ఒకటి విడాకులహక్కును అంగీకరించుట. విడాకులు హిందూ ధర్మశాస్త్రానికి విరుద్ధమనీ, దాన్ని అంగీకరించితే హిందూ సమాజం కూకటివ్రేళ్ళతో పెకలింపబడుతుందనీ సనాతన శిఖామణులు ఎందరో వాపోతున్నారు...ధర్మశాస్త్రములు ప్రమాణముగా తీసుకున్నా సనాతనుల వాదనలు సమర్థనీయములుగావు. హేతువాద దృష్టిముందు వారి వాదనలు అసలే నిలువవు. డబ్బుకు ఆశపడి తమ ముద్దుబిడ్డలను ముదుసలులకు, నపుంసకులకు, దుర్మార్గులకు బలియిచ్చే తలిదండ్రు లున్నారు. ఉంపుడుకత్తెలను మరిగి దురభ్యాసాలకులోనై, భార్యలను హింసించేవారు, దిక్కులేకుండా వారిని వదలిపెట్టేవారు ఉన్నారు. న్యాయశాస్త్ర దృష్టిలో భార్యాభర్తలైనప్పటికీ, ఒకరితో ఒకరు ఎటువంటి

సంబంధం లేకుండా వేళ్లతరబడి వేరుగాఉంటూ, అనేక కష్టాలు అనుభ విస్తూన్న వారున్నారు. తగువువచ్చినప్పుడల్లా దంపతులు విడాకులు పుచ్చుకోవాలని యెవ్వరూ చెప్పరు, చెప్పకూడదు కూడా. కాని యెట్టి విధంగాను కలిసివుండడానికి అవకాశంలేని దుఃఖ కరమైన దాంపత్యాలు మాత్రమే విడిపోవడానికి హక్కును కోరు తున్నాం. ఇప్పుడు అటువంటి దాంపత్యాలుసైతం విడిపోయి, వివాహం చేసుకోవడానికి అవకాశం లేకపోవడంవల్ల వ్యభిచారం అభివృద్ధి అవుతోంది, హిందూసమాజం కుళ్ళిపోతూంది. హిందూ సమాజాన్ని నేడున్న అధోగతినుండి రక్షించాలంటే, విడాకుల హక్కు ఉండాలి. బహుభార్యాత్వం నిషేధింపబడాలి. రావు కమిటీ యీ రెంటినీ అంగీకరించింది. భర్త ఉంపుడుకత్తెను ఉంచుకుని భార్యను హింసించుతూన్నప్పుడు, భార్య వ్యభిచారం చేస్తున్నప్పుడు, ఏ ఒకరికైనా కుష్టు, సుఖసంకటవ్యాధులు మొదలైన ప్రమాద కరమైన జబ్బులు ఉన్నప్పుడు, ఏ ఒకరైనా నపుంసకులైనప్పుడు భార్యా భర్తలలో ఎవరైనా విడాకులు పొందడానికి అవకాశం కల్పించబడినది.

"ఈ మార్పులు చాలా న్యాయమైనవి. హిందూసమాజాన్ని ప్రస్తుత అధోగతినుండి రక్షించడానికి దోహద మిచ్చేది గనుక, హిందూసమాజాభ్యున్నతిని కోరేవారందరూ దీనిని బలపరచాలి...

"మన సంఘంలో ఒక స్త్రీ మొదటి భర్త బ్రతికియుండగనే వివాహమును రద్దుపరచుకొని కొన్ని పరిస్థితులలో ఆమె మరొకరిని వివాహం చేసుకొనటం చాలా కష్టంగావుంది. దీనికి ముఖ్యకారణం యింతవరకు ఆచారంలో లేకపోవుటయే. దీని మంచి చెడ్డలు సవిస్తరముగా, సకారణంగా ఆలోచించినపుడే విడాకులచట్టం స్త్రీలకు ఎంత ముఖ్యమైనదో గోచరమవుతుంది.

"ప్రపంచంలో దాదాపు అన్ని దేశాల్లోను విడాకుల హక్కు న్నది. మన దేశంలో గూడ హిందూసమాజానికి చెందిన మలబారు

దేశస్థులందరికీ విడాకులివ్వడం ఆచారంలో నున్నది. ఇంకా హరిజనుల్లో విడాకులిచ్చుకొనుట, మారుమనువులు సాంప్రదాయాలుగా జరుగుతున్న విషయాలే. హిందూమతానికి చెందిన కొన్ని కులాలలో మాత్రమే యీనాటివరకు విడాకులనేవి లేవు.

"మన సమాజంలో స్త్రీలు విద్య, ఆర్థిక స్వాతంత్ర్యం, సంఘంలో సమానత్వం లేక బాధపడుచున్న విషయం అందరికీ తెలిసినదే. నేడు హిందూ సమాజంలో జరిగే వివాహాలలో నూటికి తొంభై తొమ్మిది వంతులు తల్లితండ్రులు వెదికి కుదిర్చినవే. ఆడపిల్లలు తమకు అనుకూలమైన భర్తను కోరిచేసుకొనే అవకాశము లేదు. కొన్ని వివాహాలు పెండ్లికూతురు అభీష్టానికి వ్యతిరేకంగా తను ప్రేమించిన వరునికాక, యితరునికిచ్చి వివాహము చేసిన ఘటనలు అనేకమున్నవి. భార్యాభర్తలిరువురు నిత్యం కీచులాడుకుంటూ ద్వేషించుకొంటూండే సంసారాలు చాలా వున్నాయి. భర్తచేత అనేక బాధలు పడుతూ తప్పించుకొనుటకు శక్యముగాక ఏనుయ్యో, గొయ్యో చూచుకొని అకాలమరణం పొందినవార నేక మంది వున్నారు. ఇంకా ఏనుయ్యో, గొయ్యో చూచుకొనే పరిస్థితులలో అనేకులు వున్నారు. కాని ఒకస్త్రీని భర్తా, అతనిబలగమూ పెట్టే బాధలను భరించలేక వెళ్ళిపోతే సమర్థించే న్యాయశాస్త్రము లేదు. పురుషులకు స్త్రీలమీద యింత నిరంకుశత్వంవుండుట తప్పే అని అందరూ ఒప్పుకొంటారు. కాని కొందరు సనాతనులు, స్త్రీలను బానిసలుగా పరిగణించే స్వార్థపరులు, సమాజ అభివృద్ధినిరోధకులు కొన్ని సందేహాలు వెలిబుచ్చి రాష్ట్ర శాసనసభలో కాశేశ్వరరావుగారు పెట్టబోతున్న విడాకుల చట్టాన్ని వ్యతిరేకిస్తున్నారు. విడాకు లివ్వటానికి అవకాశముంటే చీటికి మాటికి స్త్రీలు విడాకులిచ్చి మరల వివాహాలుచేసుకుంటారని, యిలా అవినీతికి కారణమవుతారని అర్థంలేని వితండవాదనలు చేస్తున్నారు. వారే ఒక ప్రక్కా మా హిందూ సమాజంలోని స్త్రీలు అన్ని దేశాల్లోని స్త్రీలకంటే ఆదర్శజీవితం గలవారని చెప్పుకొంటున్నారు. వేరొకప్రక్కన కలిసి

జీవితం గడపటానికి మసాధ్యమైన పరిస్థితులలో ప్రసకరించటానికి అవసరమైన విడాకుల చట్టాన్ని స్త్రీ లందరూ విచక్షణ లేకుండా దుర్వినియోగం చేస్తారని చెప్పటచూస్తే వీరికి నిజంగా స్త్రీల నైతిక ప్రవర్తనమీద ఏలాంటి గౌరవమూ లేదని స్పష్టమవుతూంది. వారు యీ విధంగా మాట్లాడుట తమ అక్కచెల్లెండ్రను, తల్లులను, భార్యా బిడ్డలను అవమానపరచుతున్నామని గ్రహించాలి. విడాకులచట్టం వచ్చినంతమాత్రాన ఏ స్త్రీతన అనుకూలమైన భర్తను, బిడ్డలను వదలుటకు యిష్టపడదు. కత్తిపీటతో కూరలు కోస్తాంగాని గొంతుక కోయంగదా !"

ఈ పై వాక్యాలు సుమారు పదేళ్ళ క్రిందట ఆంధ్రరాష్ట్ర మహిళామండలి తమచే ప్రచురించబడిన "హిందూ న్యాయశాస్త్రం: స్త్రీల హక్కులు" అనే వ్యాసావళిలోనివి. స్వరాజ్యం సంపాదించి తొమ్మిది సంవత్సరాలైనా హిందూ వివాహచట్టం పార్లమెంటులో చర్చకు వచ్చినప్పుడు దేశంలో అనేకమంది నోట పై వింతవాదనలనూ, పిడివాదాలనూ విన్నాం. ముఖ్యంగా చట్టంలోవున్న విడాకుల నిబంధనగురించిన చర్చలలో హిందూ సమాజ పునరుద్ధరణ పేరిట యెన్నో వితండవాదనలు జరిగేయి. అయితే భారత మహిళా ప్రపంచం చేసిన తీవ్ర ఆందోళన ఫలితంగాను, దేశంలోనూ, శాసన సభల్లోనూ వున్న అభివృద్ధిశక్తుల ధైర్యమైన పోరాటంవల్లనూ, నెహ్రూప్రభుత్వంయొక్క పట్టుదలవల్లనూ ఈ బిల్లు చట్టం అయింది. ఈ విడాకులహక్కు ఎంతముఖ్యమైనదో ఈ చట్టంలో వుండే నిబంధనలవల్ల మనకు తెలుస్తుంది.

## విడాకుల హక్కు

ఈ చట్టంవల్ల యిదివరకు జరిగిన వివాహాలను, ఈ తరవాత జరిగిన వివాహాలను విడాకులిచ్చి రద్దుచేసుకునే అవకాశముకల్పించబడింది. ఈ చట్టం సెక్షను 13 ప్రకారం ఆ సెక్షనులో వివరింపబడిన కారణాలలో యేదో ఒకదానినేనా భర్తకాని, భార్యకాని జిల్లా

కోర్టులో పిటీషనుపెట్టి విడాకులనుపొంది వివాహాన్ని విచ్ఛేదం చేసు కోవచ్చును. విడాకులను కోరడానికి భార్యకాని, భర్తకాని పిటీ షనులో ఉదహరించవలసిన కారణాలు :

(i) భర్త పరస్త్రీతోను, భార్య పరపురుషునితోను వ్యభి చరించుట; లేక

(ii) భర్తకాని, భార్యకాని హిందూమతాన్ని వదిలేసి అన్యమతాన్ని స్వీకరించుట; లేక

(iii) భర్తకాని, భార్యకాని పిటీషను దాఖలుచేసిన మూడు సంవత్సరాల ముందునుంచీ కుదురని మతిభ్రష్టత కలిగివుండుట; లేక

(iv) భర్తకాని, భార్యకాని పిటీషను దాఖలు చేసేటప్పటికి మునుముందు మూడు సంవత్సరాలకు పైబడి తీవ్రమైనటువంటిన్నీ, కుదురనటువంటిన్నీ కుష్టురోగముతో బాధపడుతూండుట; లేక

(v) భర్తకాని, భార్యకాని పిటీషను దాఖలు చేసేటప్పటికి మునుముందు మూడు సంవత్సరాలకు పైబడి తీవ్రమైనటువంటిన్నీ, మరి ఒకరికి సోకడానికి ప్రమాదము కలిగియున్నటువంటిన్నీ సుఖ రోగముతో బాధపడుతూండుట; లేక

(vi) భర్తకాని, భార్యకాని సన్యాసాశ్రమాన్ని స్వీకరిం చుటద్వారా ప్రపంచాన్ని వదిలిపెట్టివేయుట; లేక

(vii) భర్తకాని, భార్యకాని ఏడేళ్ళకుపైగా బతికివున్నట్టు జాడ తెలియకపోవుట; లేక

(viii) భర్తకు వ్యతిరేకంగా కాని, భార్యకి వ్యతిరేకంగా కాని కోర్టువారు దాంపత్యమును వదిలివేయుటకు డిక్రీయిచ్చిన తరు వాత భర్త భార్యతోగాని, భార్య భర్తతోగాని భార్యాభర్తలుగా తిరిగి జీవనం చెయ్యకపోవుట; లేదా

(ix) భర్తపేరగాని, భార్యపేరగాని కోర్టువారు దాంపత్యం పునరుద్ధరిస్తూ డిక్రీ యిచ్చినప్పటికీ, డిక్రీయిచ్చి రెండుసంవత్సరాలై నప్పటికీ దాంపత్య పునరుద్ధరణను అమలు జరపనప్పుడు.

భార్యకు విడాకులను కోరడానికి మరికొన్ని కారణాలను కూడా యీ చట్టం గుర్తించింది. ఈ చట్టం రాకముందు జరిగిన వివాహాల్లో, భర్త మొదటి వివాహం చేసుకుని, మొదటి భార్య బతికి వుండగా రెండవ భార్యను వివాహం చేసుకున్నాడన్న కారణంచేత రెండవ భార్య విడాకులకు పిటీషను దాఖలుచేయవచ్చు. అయితే పిటీషను వేసేటప్పటికి మొదటిభార్య బతికివుంటేనే రెండవ భార్య యొక్క పిటీషను చెల్లుతుంది. పిటీషను వేసేటప్పటికి మొదటిభార్య చనిపోయివుంటే రెండవ భార్యకి యీ కారణంక్రింద విడాకులు కోరడానికి హక్కువుండదు.

ఈ చట్టం రాకముందు జరిగిన వివాహాల్లోనైనాసరే, చట్టం వచ్చినతరువాత జరిగిన వివాహాల్లోనైనాసరే-వివాహం జరిగిన తరువాత స్త్రీని చెరపట్టిన నేరానికిగాని, పురుష సాంగత్య నేరానికి గాని, పశుత్వ నేరానికిగాని భర్త శిక్షింపబడితే, భార్య విడాకులను కోరవచ్చు.

ఈ వివాహ చట్టంలో విడాకుల గురించి ఒక ముఖ్యమయిన విషయం వుంది. సాధారణంగా వివాహంజరిగిన మూడుసంవత్సరాల లోపున విడాకులను కోరడానికి వీలు లేదు. వివాహంజరిగిన అధమం మూడేళ్లు పూర్తి అయిన తరువాతనే విడాకులకోసం దావా వెయ్యడానికి అవకాశం యేర్పడుతుంది (సెక్షను 14.).

అయితే మరీ తీవ్రమైన పరిస్థితులలోను, అత్యంత అసాధారణ పరిస్థితులలోను విడాకులను కోరవచ్చు. ఈ విధంగా మూడు సంవత్సరాలలోగానే దాఖలుచేసే పిటీషనుల విచారణ విషయమై హైకోర్టు కొన్ని ప్రత్యేక నిబంధనలు చేసివుంటేనేతప్ప, అట్టి పిటీషనులను దాఖలు చెయ్యడానికి అవకాశం వుండదు. అప్పుడుకూడ వాదికి ఎంతో గొప్ప అన్యాయం జరుగుతూన్నట్టున్ను, ప్రతివాది స్వభావం చాల నీచమైనదని కోర్టువారు అభిప్రాయపడితేనే తప్ప పిటీషనును అంగీకరించరు. కాని కోర్టువారికి వాది అసత్యాలను చెప్పి

నదనిన్నీ, కొన్ని సంగతులను దాచిపెట్టినదనిన్నీ తోస్తేమాత్రం - విడాకులకు డిక్రీ యివ్వ నిరాకరించవచ్చు. అలా కోర్టువారు నిరాకరించినప్పుడు వాది తిరిగి మూడు సంవత్సరాలు అయిపోయిన తరువాత మళ్ళీ విడాకులకు దావా వెయ్యవచ్చు. ఒకవేళ విడాకులకు డిక్రీ యిచ్చినా - వాది అసత్యాలుచెప్పి సంగతులను దాచిపెట్టిన కారణంచేత - వివాహం అయిన మూడు సంవత్సరాల తరువాతనే విడాకుల డిక్రీని అమలు పరచడానికి వీలవుతుంది అని కూడా కోర్టువారు ఉత్తరువు చేయవచ్చు. అంతేకాదు; వివాహం అయిన మూడేళ్ళలోపుగానే విడాకులను కోరుతూ దావా వేసిన యెడల, కోర్టువారు పిటీషనును ఆలోచించినప్పుడు భార్యా భర్తలకు పిల్లలువుంటే - ఆ పిల్లలక్షేమం దృష్ట్యానూ, భార్యాభర్తలు యిద్దరూ సఖ్యపడే అవకాశం వుండవచ్చుననే విషయంకూడా దృష్టిలో పెట్టుకుని మరీ తీర్పు చెబుతారు.

విడాకులు పొందిన తరువాత వివాహం రద్దు అయిపోతుంది కాబట్టి, విడాకులు పొందినవారు తిరిగి వివాహం చేసుకోడానికి ఎట్టి ప్రతిబంధకమున్నూ లేదు. అయితే ప్రతివాది అయిన భర్తకాని, భార్యకాని పైకోర్టుకి అనగా హైకోర్టుకి అపీలుచేస్తారేమో చూచుకొని ఆ అపీలు గడువుదాటిపోయిన తరవాతగాని, అపీలు దాఖలు చేస్తే, పైకోర్టువారు అపీలును తిరస్కరించిన తరువాతగాని పెండ్లి చేసుకోవచ్చు. అప్పుడుకూడా మొదట జిల్లాకోర్టులో డిక్రీయిచ్చిన తేదీనుండి ఒక సంవత్సరంకాలం గడచిన తరువాతనే పెళ్ళిచేసుకోడానికి వీలుంటుంది. ఈ లోపున పెళ్ళిచేసుకోవడానికి వీలుండదు.

## పిల్లలు

నిషిద్ధ వివాహాలనుగాని, విసర్జనీయమైన వివాహాలనుగాని చేసుకున్నవారు కోర్టువారిచేత తమ వివాహాలను రద్దుచేయించుకొనుటకు యీచట్టం అవకాశం కలిగిస్తోంది. ఈ వివాహములవల్ల కలిగిన పిల్లలు న్యాయసమ్మతముగా కలిగిన సంతానము కిందనే

భావింపబడతారు. ఇంతకుముందు-అనగా యీ చట్టం అమలులోకి రాకపూర్వం నిషిద్ధ వివాహంవల్ల పుట్టిన సంతానం ఔరసులుగా భావింపబడేవారుకాదు. కాని యీ చట్టంయొక్క 16 వ సెక్షన్ అట్టి కళంకాన్ని తొలగించి వారిని న్యాయసమ్మతమైన సంతానము గానే భావించుతుంది. అయినా యీ బిడ్డలకు పూర్తిఅయిన వారసత్వపు హక్కు లేదు. వీరికి తమ తల్లిదండ్రుల ఆస్తిపైనే హక్కు వుంటుంది. కాని సమిష్టి ఆస్తిపైన హక్కు వుండదు. అందుచేత ఈ చట్టం ప్రకారం యీబిడ్డలు ఔరసులైనా, వీరి ఆస్తిహక్కులు మాత్రం తమ తల్లితండ్రుల ఆస్తులకే పరిమితమై వున్నాయి.

విసర్జనీయమైన వివాహమువల్ల కలిగిన సంతానముకూడా ఔరసులే అని ఈ చట్టం నిర్ణయిస్తూంది. అయితే కోర్టులో పిటీషను వేసి విసర్జనీయమైన వివాహాన్ని రద్దు చేయించుకొని యెడల యీ సంతానము ఔరసులు అవడమేకాకుండా, పూర్తి అయిన ఆస్తి హక్కులువుంటాయి. వారి తల్లిదండ్రుల ఆస్తులకేకాక, జాయింటు కుటుంబ ఆస్తిలోకూడా పూర్తి హక్కు వుంటుంది. అయితే విసర్జనీయమైన వివాహాన్ని కోర్టులో రద్దు చేయించుకుంటే బిడ్డలు ఔరసులైనప్పటికీ వివాహము రద్దుకాబడినది అవడంచేత బిడ్డలకు-నిషేధపు వివాహమువలన కలిగిన ఔరస సంతానము వలెనే-తల్లిదండ్రుల ఆస్తులపైనే హక్కు వుంటుంది. కాని జాయింటుకుటుంబ ఆస్తిపై హక్కు వుండదు. తల్లి దండ్రుల వివాహము రద్దుపరచబడినది కాబట్టి వీరి ఆస్తి హక్కులు పరిమితములే.

విడాకుల విషయములో - వివాహము కోర్టువారిచే విచ్ఛేదము చేయబడినది కాబట్టి-ఆ తల్లిదండ్రుల సంతానము ఔరసులు. వారి సంతానానికి పూర్తి అయిన ఆస్తి హక్కులు వుంటాయి.

## శిక్షలు

ఈ చట్టం అమలులోకి వచ్చిన తరువాత ఏ పురుషుడుకాని, స్త్రీ కాని, యిదివరకే పెళ్ళి చేసుకునివుండి, భార్యకాని, భర్తకాని

బ్రతికివుండినన్నీ, మళ్ళీ పెళ్ళి చేసుకొననియెడల అట్టి వివాహములు బహు భార్యాత్వ నేరముకిందనూ, బహు భర్తృత్వ నేరముకిందనూ ఆ పురుషుడుకాని, స్త్రీకాని శిక్షింపబడి ఆ వివాహము రద్దు కాబడును. ఆ నేరము ఇండియన్ పీనల్‌కోడు 494, 495 సెక్షనుల క్రింద శిక్ష విధింపబడును (జుల్మానాతోసహా 7 సంవత్సరముల వరకున్నూ, లేదా 10 సంవత్సరముల వరకున్నూ శిక్ష). ఇట్టి శిక్షార్హమైన వివాహానికి సహాయపడిన వారందరూ నేరస్థులయొక్క కుమ్మక్కుదార్లక్రింద శిక్షింపబడుతారు.

వరునకు 18 సంవత్సరములు, వధువుకు 15 సంవత్సరములు వుండాలికదా. ఈ వయసు పూర్తికాకుండానే పెండ్లి చేసుకొనిన యెడల వధూవరులకు చెరిఒకరికి పదిహేను రోజులవరకూ విడి ఖైదున్నూ, లేక వెయ్యి రూపాయలవరకు జుల్మానాయున్నూ శిక్ష విధింపబడును. ఈ చట్టానికి వ్యతిరేకంగా నిషిద్ధబాంధవ్యము వున్న వ్పటికిన్నీ, సపిండులైనవ్పటికిన్నీ వివాహము చేసుకొన్న వధూవరులకు చెరిఒకరికి ఒక నెల విడిఖైదు, లేదా వెయ్యి రూపాయల వరకూ జుల్మానా శిక్ష విధింపబడును.

వధువు 18 సంవత్సరములకు తక్కువ వయస్సుకలిగి, వధువు యొక్క సంరక్షణకర్త అనుమతి లేనిదే వివాహము జరిగినయెడల, వధూవరులకు చెరిఒక్కరు వెయ్యిరూపాయలవరకూ జుల్మానా శిక్షకు పాత్రులు అవుతారు.

## కోర్టు వ్యవహారము

ఈ చట్టంక్రింద జరిగే కోర్టు వ్యవహారం యావత్తూ మొదట జిల్లాకోర్టులో జరగాలి. వివాహము యే జిల్లాలో జరిగిందో ఆ జిల్లా కోర్టులోకాని, లేక భార్యాభర్తలు యిద్దరూ వేరువేరుగా ఒక జిల్లాలోనే నివసిస్తే ఆ జిల్లాయొక్క జిల్లాకోర్టులోకాని, లేక భార్యాభర్తలు యిద్దరూకలిసి వుండినప్పుడు ఆఖరుసారి యిద్దరూకలసి యే వూరిలో నివసించారో, ఆ వూరుయొక్క జిల్లాకోర్టులోకాని మొదటిసారిగా పిటీషనులు దాఖలుచేయాలి.

ఈ చట్టంకింద పిటీషనులు వ్యాగ్రాలు విచారించేటప్పుడు భర్తకాని, భార్యకాని కోరినయెడలనూ, లేక కోర్టువారు అభిప్రాయపడినా, విచారణ బహిరంగంగా కాకుండా రహస్యంగా జరగాలి. అంతేకాకుండా కోర్టులో జరిగిన వ్యవహారాన్ని కోర్టువారి అనుమతిపొందకుండా ఎవ్వరూకూడా అచ్చువెయ్యడానికకాని, ప్రచురించడానికికాని వీలులేదు. అట్లు ప్రచురించినవారు, అచ్చువేసినవారు వెయ్యిరూపాయలవరకు జుల్మానాకు పాత్రులవుతారు. రహస్యంగా విచారణ జరపడానికి అవకాశం యివ్వడం చాలా మంచివిషయం అని వేరే చెప్పనక్కరలేదు.

ఈ చట్టం కింద దాంపత్య పునరుద్ధరణకుగాని, కోర్టు ద్వారా దాంపత్యమునుండి విడిపోవుటకుగాని, విడాకులకొరకుగాని పిటీషను దాఖలు చేసేటప్పుడు, పిటీషను దాఖలుచేయువారు తాను ఏ తప్పులు చేసివుండినా పిటీషను గెలవడానికిగాను తానుచేసిన తప్పులనుగాని, తాను అనుభవించిన ప్రతిబంధకముకాని యేవిధముగాను తన లాభముకొరకు ఉపయోగించుకోకూడదు. భార్య కాని, భర్తకాని రెండవవారిపై వ్యభిచారమును, లేక లైంగిక సంపర్కమును నిందగా మోపిన యెడల, అట్టి పనులకు తాను ఏ విధముగాకూడా సహాయపడడంగాని, అప్పట్లో అనుమతించడంగాని, క్షమించి రెండవవారితో తిరిగి వైవాహిక జీవితం జరిగించిన యెడలకాని, లేక తన యెడల క్రూరముగా ప్రవర్తించినట్టు నిందమోపినయెడల అట్టి క్రౌర్యాన్ని క్షమించడంకాని ఏవీ జరిగివుండకూడదు. పిటీషను వేసినప్పుడూ, కోర్టులోవ్యవహారంనడుస్తూన్నప్పుడూ ప్రతివాదితో వాది యేవిధంగా కూడా షరీకు కాకూడదు. వాది తనకు సంగతులు తెలిసిన వెంటనే ఎట్టి అనవసరమైన కాలహరణముకాని, అనుచితమైన ఆలస్యము కాని చేయకుండా కోర్టు చర్య తీసుకోవాలి. మరి యేయితర ప్రతిబంధకాలు లేనప్పుడున్నూ, పైన ఉదహరించిన తప్పులను వేటినీ

కూడా వాదిచేయనప్పుడున్నూ కోర్టువారు పిటీషనును అంగీకరించి వాది కోరిన ప్రత్యామ్నాయాన్ని మంజూరు చేస్తారు.

పిటీషను విచారణజరపడంలో ప్రతివాది వాదించినా, లేక హాజరుకాకపోయినాసరే కోర్టువారు అన్నిసంగతులను సమగ్రంగా ఆలోచించి, మొట్టమొదట భార్యాభర్తలు యిద్దరున్నూ సఖ్య పడేటట్టు ప్రయత్నించాలనీ, అలా సఖ్యత కుదరనప్పుడే కోర్టు వారు తీర్పుచెప్పాలనీ కోర్టువారిని యీ చట్టం ఆదేశిస్తూంది.

కొన్ని సందర్భాల్లో భార్యకాని, భర్తకాని వైద్యులచే తనిఖీ చేయబడుట అవసరం అని వాదికాని, ప్రతివాదికాని కోరవచ్చును. భార్యగాని, భర్తగాని అట్టి వైద్యులచేత తనిఖీచేయబడడానికి నిరాక రించవచ్చును. అట్టివైద్యులచే తనిఖీని బలవంతముగా చేయించుటకు ఎవ్వరికీ అధికారము లేకపోయినప్పటికీ, అట్లు తనిఖీని నిరాకరిస్తే మాత్రం కోర్టువారికి నిరాకరించిన వారి యెడల సదభిప్రాయము కలుగదు.

జిల్లాకోర్టువారు యిచ్చే ప్రతి తీర్పుకీ హైకోర్టులో అపీలు వుంటుంది. అందుచేత అపీలు హక్కును ఈ చట్టం కలుగజేస్తూంది. అయితే దావా ఖర్చుల విషయమై జిల్లాకోర్టు యిచ్చిన తీర్పుకు మాత్రం అపీలు వుండదు.

## జీవన భృతి - మనోవర్తి

ఈ చట్టాన్ని అనుసరించి కోర్టులో వ్యాజ్యం వేసినప్పుడు, కోర్టులో విచారణ పూర్తిఅయి తీర్పు చెప్పేలోపల భార్యనుగాని, భర్తకుగాని తన జీవనోపాధికిన్నీ, కోర్టుఖర్చులు భరించడానికిన్నీ తగినంత డబ్బు వసతి లేదని కోర్టువారు అభిప్రాయపడినట్లైతే, వాది భర్త అయినాసరే, భార్య అయినాసరే కోర్టువారికి దరఖాస్తు చేసిన యెడల, కోర్టువారు ప్రతివాది యొక్కయు, వాది యొక్కయు ఆదాయములదృష్ట్యా కోర్టులో వ్యాజ్యము జరుగుకాలములో ప్రతిజీవనభృతికిగాను నెలకు కొంత మొత్తమున్నూ, కోర్టుఖర్చు కొరకున్నూ వాదినుండి వాదికి యిప్పించవచ్చును.

సాధారణంగా భార్యకు స్వంత డబ్బు వుండదు కనుకనూ, భర్తకే భార్యకంటే హెచ్చు డబ్బు ఆదాయం వుండడంచేత, కోర్టు వ్యవహారము నడుస్తున్నప్పుడు భర్తచేత అతని ఆదాయంలో కొంత భాగం భార్యకు జీవనభృతికింద యిప్పించడం రివాజు. భర్త నిర్బంధించి భార్యను వ్యభిచార వృత్తిలోకి దింపినయెడల భార్యకు తప్పకుండా వ్యాజ్యము జరుగుతున్న కాలములో జీవనభృతికిగాను నెలనెలకు కొంతసొమ్ము తప్పక యిప్పిస్తారు (49 ఐ. సి. 203). భర్త భార్యమీద జారత్వం మోపి ఆ కారణంచేత విడాకులకు వ్యాజ్యం వేసినప్పుడు, ఆ ప్రవర్తనను ఆమె ఒప్పుకోని పక్షమందు కోర్టులో వ్యాజ్యము జరుగుతున్నంతకాలం కోర్టుఖర్చులకు కొంత సొమ్మును భర్తనుండి కోరుటకు భార్యకు పూర్తిహక్కు వుంది (గార్లింగు, వ్య, గార్లింగు, ఎ.ఐ.ఆర్. 1922 అలహాబాదు 504). హైకోర్టులో అపీలు విచారణ జరుగుతూన్నప్పుడు కూడా; భార్య దరఖాస్తు పెట్టుకుంటే భార్యకు తన అప్పీలు నడిపించుటకు గాను భర్తవద్దనుండి కొంత సొమ్ము కోర్టువారు యిప్పించవచ్చును (37 ఐ. సి. 216)

పార్లమెంటుయొక్క జాయింటు సెలెక్టుకమిటీ ఈ బిల్లుపై సమర్పించిన తమ నివేదికలో కోర్టులో వ్యాజ్యము నడుస్తూన్నప్పుడు కోర్టు ఖర్చులకుగాను భర్తకి తగిన వసతి లేనప్పుడు, భార్యనుండి భర్తకు కొంత పైకము యిప్పించవచ్చునని నివేదించారు. సెలెక్టు కమిటీలోవున్న తొమ్మండుగురు స్త్రీ సభ్యురాండ్రలోనూ ముగ్గురు - అనగా శ్రీమతి రేణుచక్రవర్తి, ఇలాపాల్ చౌదరి, చంద్రావతి లఖన్‌పాల్ గార్లు - మాత్రమే తమ మైనారిటీ నివేదికలో మరే యితర దేశంలోనూకూడా భార్యచేత భర్తకు జీవన భృతి యిప్పించే రివాజులేదు అని వ్రాశారు. కోర్టులో వ్యవహారము నడుస్తూన్నంతకాలము కోర్టు ఖర్చులకుగాను భర్త నెలసరి నికర ఆదాయంనుండి ఐదవవంతు యిప్పించడం మామూలు. భార్య

...తో కాని, విస్తారం డబ్బుతో గాని భర్త యింటికి వచ్చి ...ంటే భర్త నెలసరి నికరాదాయంలో సగం కూడా భార్యకి మనోవర్తి కింద యిప్పించడం జరిగింది (జానెట్ లియోనారా, వ్య, హెర్బర్టు పెర్సివల్. ఎ. ఐ. ఆర్. 1931 ఔధ్ 365 - 132 ఐ. సి. 771).

ఈ చట్టంలోలాగు భార్యచేత భర్తకి జీవనభృతి యిప్పించడం అన్ని దేశాల్లోకి యిదే ప్రథమం అనిన్నీ, మన దేశంలో స్త్రీల ఆర్థిక పరిస్థితి పురుషులకంటే ఎన్నోరెట్లు హీనంగా వుంటున్నది కాబట్టి ఈ నిబంధనవల్ల స్త్రీలకు అన్యాయం జరిగిందని కొందరు అభిప్రాయ పడుతున్నారు. జీవనభృతి యిప్పించడంలోను, కోర్టుఖర్చుల నిమిత్తం డబ్బు యిప్పించడంలోను కోర్టువారు అన్ని పరిస్థితులనూ ఆలోచించే తీర్పు యివ్వవలసిందని ఈ చట్టం కోర్టువారిని ఆదేశిస్తూంది.

జీవనభృతి యిప్పించినస్లో పిటీషనుపై కోర్టువారు తీర్పుచెప్పే టప్పుడుగాని, లేక తరువాత గాని వ్యాజ్యము తెచ్చినవారు మనోవర్తికిగాను అర్జీ పెట్టుకొనినయెడల ప్రతివాది భర్త అయితే భర్తచేత భార్యకు, లేక భార్య ప్రతివాది అయితే భార్యచేత భర్తకు మనోవర్తి యిప్పించుతారు. ఈవిధంగా మనోవర్తి యిప్పించే టప్పుడు వాదియొక్క, ప్రతివాదియొక్క స్థితిగతులను, వసతులను, తాహతులను, పిటీషనులోని సంగతులను కోర్టువారి ఎదుట వారి వారి నడతలను ఆలోచించి న్యాయమైన మనోవర్తిని నిర్ణయించి ఆర్డరు జారీచేస్తారు. అవసరమనితోస్తే కోర్టువారు ప్రతివాది సరిగా మనోవర్తి చెల్లించుటకుగాను ప్రతివాది చరాస్తిలో అవసర మైన భాగమును విరియా వేయించవచ్చును. మనోవర్తి పైకం మొత్తంగా ఒక్కసారైనా, లేదా దఫదఫాలవారీగా యింతింత పైకము అని కూడా కోర్టువారు నిర్ణయించి ఆర్డరు జారీచేస్తారు.

మనోవర్తి పుచ్చుకొనేవారు భార్య అయినాసరే, భర్త అయినాసరే వ్యభిచరించకుండాను వున్నంతకాలమూ, తిరిగీ పెళ్లి చేసుకోకుండా వున్నంతకాలమూ, యావజ్జీవమూకూడా మనోవర్తి

పుచ్చుకొనే హక్కు వుంటుంది. మనోవర్తికిగాను వాది ఎప్పుడైనా సరే డిక్రీ యిచ్చేటప్పుడుగాని, డిక్రీ యిచ్చిన తరువాతగానీ, మరి యెప్పుడేనాసరే పిటీషను పెట్టుకోవచ్చు. ఇందుకు కాలదోషము లేదు. కాని దావాదారుని నడతలో ఏమాత్రం దోషంవున్నా మనోవర్తికి హక్కు పోతుంది.

భార్యయొక్క స్థితిగతులుకాని, భర్తయొక్క స్థితిగతులు కాని మారినయెడల, అందుకు అనుగుణ్యంగా ఎప్పుడైనాసరే మనోవర్తి మొత్తాన్ని తగ్గింపడానికిగాని, హెచ్చించడానికిగాని కోర్టు వారికి పూర్తి అధికారం వుంది.

వ్యాజ్యంలో డిక్రీ యిచ్చేటప్పుడు భార్యాభర్తల వివాహ సమయమందుకాని, వివాహసందర్భంలోకానిభార్యాభర్తలుయిద్దరికీ సమిష్టిగా యితరులుయిచ్చిన బహుమానాలు, కానుకలు, వీటిపంపకము గురించికూడా కోర్టువారు ఆర్డరు వేయవచ్చు. భార్యకుగాని, భర్తకుగాని వేరువేరుగా యితరులు యిచ్చినబహుమానాలు, కానుకలు మాత్రం పంపకానికి వీలులేదు. ఆ వస్తువులు ఎవరివివారివే.

## బిడ్డల పోషణ

భార్యాభర్తలకు పిల్లలువుంటే, పిల్లలు ఎవరి అధీనంలో వుండవలసినదీ, వారిపోషణ, విద్య విషయమై కోర్టు విచారణ జరుగుతూన్నప్పుడుకాని, విచారణ అయి డిక్రీ యిచ్చినప్పుడుకాని, మరెప్పుడైనాసరే, సాధ్యమైనంతవరకు పిల్లలయొక్క యిష్టా యిష్టములను గమనించి కోర్టువారు ఆర్డరు జారీచేయవచ్చు. తాత్కాలికముగాకూడా కోర్టువారు ఆర్డరులను వేయవచ్చు. ఆర్డరులను అప్పుడప్పుడు పరిశీలించి కోర్టువారికి తోచినట్టు తగురీతిని మార్చడానికి కోర్టువారికి పూర్తి అధికారం వుంది.

పిల్లలగురించి యే ఆర్డరులు జారీచేసినా వారియొక్క అభిప్రాయాలను తెలుసుకుని సాధ్యమైనంతవరకు వారి అభిప్రాయాలను గౌరవించడం కోర్టువారి విధి.

మైనర్లైన పిల్లలు ఎవరి అధీనంలో వుండవలసినదనే విషయమై ఆర్డరు వేసేటప్పుడు పిల్లలయొక్క శ్రేయస్సే కోర్టు వారు ప్రధానంగా ఆలోచిస్తారు. తండ్రీ, తల్లీ యొక్క హోదాలు, చదువు, యోగ్యతలు, పిల్లలయొక్క భావి అభివృద్ధి, తల్లి యొక్క నడవడిక, ప్రవర్తన దృష్టిలో పెట్టుకొనవలసిన ముఖ్యవిషయాలు.

పిల్లల గురించిన విషయాలన్నీ కూడా అర్జీ మూలంగా జిల్లాకోర్టులోనే దాఖలు చేయవలసి వుంటుంది. కోర్టువారికి తమ ఆర్డర్లను అప్పుడప్పుడు పరిస్థితులకు అనుసరించి యే విధముగా న్యాయమనితో స్తే ఆ విధంగా మార్చుకొనుటకుగానైనా సరే పూర్తి అధికారం వుంది.

ఈ చట్టం అమలులోకి రాకపూర్వం చట్టసమ్మతంగా జరిగిన అన్ని సగోత్ర, సప్రవర వివాహాలు, అన్ని వర్ణాంతర వివాహాలు, హిందూ, జైన, సిక్కు మతస్థుల మధ్య జరిగిన అన్ని మతాంతర వివాహాలు ఈ చట్టంవల్ల రక్షింపబడుతున్నాయి. ఈ చట్టం అమలులోకివచ్చాక విడాకులకు సంబంధించినంతవరకు మళయాళ దేశస్థులకు వర్తించే మరుమక్కతాయపు చట్టపు హక్కులను రక్షిస్తుంది. కులాచారప్రకారం వివిధవర్గాలలో విడాకులు యిచ్చు కునేహక్కునుకూడా యీచట్టం ప్రజాహితానికి, ప్రజానీతికి విరుద్ధంగా లేనంతమేరకు పూర్తిగా గుర్తిస్తుంది.

# 4

# స్త్రీలు: వారసత్వపు హక్కు

స్త్రీ జనాభ్యుదయానికి ఆర్థిక స్వాతంత్ర్యము పునాది. మనం స్వరాజ్యాన్ని సంపాదించుకుని తొమ్మిదేళ్ళయింది. ఈ స్వరాజ్య సంపాదనలో భారత స్త్రీలోకము ప్రముఖపాత్రను వహించింది. ఈ తొమ్మిదేళ్ళలో రాజకీయ రంగంలోనూ, వైజ్ఞానికరంగంలోనూ మన స్త్రీలు ఘనవిజయాలను సంపాదించారు. కాని ఆర్థికంగా మాత్రం యింకా బాగా వెనుకబడే వున్నారు. స్త్రీల ఆర్థికస్థితి చక్కబడాలంటే అందుకు ప్రతిబంధకములుగా వుంటూ తరతరాల నుంచీ వస్తూన్న వారసత్వపు విధానం, భూస్వామ్య విధానం పూర్తిగా మారవలసి వుంటుంది. ఆ విధంగా హిందూ సమాజం పరిణామాన్ని పొందితేనేకాని మనం నిజమైన సోషలిస్టు వ్యవస్థను స్థాపించుకోలేము.

వివాహ విషయంలోలాగే ఆర్థిక విషయంలో కూడా హిందూ స్త్రీకి పురుషునితోపాటు సమానహక్కులు లేకుండా చాలా అన్యాయం జరుగుతూ వచ్చింది. హిందూ వారసత్వ ధర్మాన్ని క్రోడీకరించి చట్టబద్ధం చేసే ఉద్దేశంతో బి. యన్. రావు కమిటీ నిర్ణయింపబడింది. రావుకమిటీ తన సిఫార్సులలో వారసత్వపు విషయాల్లో హిందూ స్త్రీలకు జరుగుతూన్న అన్యాయాన్ని కొంత వరకేనా తొలగించేందుకు ప్రయత్నించి హిందూకోడు బిల్లును

తయారుచేసింది. ఆ ముసాయిదా బిల్లులో హిందూ వివాహానికి సంబంధించిన విషయాలను విడదీసి హిందూ వివాహచట్టాన్ని తయారుచేసి ఆ చట్టాన్ని పార్లమెంటు 1954 లో శాసనంగా చేసింది. వారసత్వ ధర్మానికి సంబంధించినంతవరకు రావుకమిటీ చేసిన సిఫార్సులను ఒక చిత్తు బిల్లు రూపంలో పార్లమెంటు ముందు ప్రవేశపెట్టబడింది. పార్లమెంటుచే అనేక సవరణలు చేయబడి యీ బిల్లు చివరకు "హిందూవారసత్వచట్టం" అనే పేరుతో పార్లమెంటుచే అంగీకరింపబడి యీ సంవత్సరం జూన్ 17వ తేదీన అమలులోకి వచ్చింది. ఈ చట్టం అమలులోకి రావడంతో అనేక సంవత్సరాలనుంచీ స్త్రీలు తమ న్యాయమైన హక్కులను గురించి సాగిస్తూన్న పోరాటంలో ఒక ప్రధాన విజయాన్ని సాధించడమైంది.

## వారసత్వపు హక్కు

హిందూ ధర్మశాస్త్రంలోను, హిందూసామాజికవ్యవస్థలోను వారసత్వం చాలా ప్రధానమైన విషయం. అనాదినుంచీ మన సంఘంలో వారసత్వపు అర్హతకీ, పితృకార్యాలుచేసే అర్హతకీ తెగ గొట్టడానికి వీలులేనట్టి లంకె యేర్పడిపోయింది. మృతకర్మలుచేసి ఆబ్దికాలు పెట్టేందుకు ఆడవాళ్లు పనికిరారు అని మన స్మృతులు, శాస్త్రాలు శాసించడంచేత హిందూస్త్రీకి పురుషునితోపాటు సమానమైన వారసత్వపు హక్కులు శూన్యం అయినాయి. అనేక సాంఘిక కారణాలచేత హిందూసమాజంలో స్త్రీ పురుషునికి బానిసగా తయారై స్త్రీకి వున్న ఆమాత్రపు కాస్త వారసత్వపు హక్కులు కూడా కాలక్రమేణా నామమాత్రం అయి, ఆ కొద్ది ప్రతిఫలంకూడా భర్తో, మామగారో, తండ్రో అనుభవించడం రివాజై పోయింది. బ్రిటిషువారి హయాంలో న్యాయస్థానాలు వ్యాజ్యాలు ప్రబలి, బూజుపట్టిన పాతశాస్త్రాలకి కోర్టులలో కొత్త వ్యాఖ్యానాలు తయారై అసలే చిక్కుఅయిన సమస్యలను మరింత చిక్కులు చేసి వున్న పరిమితపు హక్కులు కూడా వ్యర్థం అయిపోయాయి. ఇటీవల భారత నారీమణులు సలిపిన తీవ్ర కృషి ఫలితంగా 1929 లో

శాసనసభలో ప్రవేశపెట్టబడి అమలులోకి వచ్చిన హిందూ వారసత్వ శాస్త్ర సవరణచట్టము వల్లనూ, 1937 లో శ్రీ జి. బి. దేశముఖుగారి హిందూ స్త్రీల ఆస్తిహక్కుల చట్టంవల్లనూ స్త్రీల హక్కుల విషయంలో కొంతమాత్రపు న్యాయమేనా జరిగింది. కాని కొన్ని రాజ్యాంగపు సమస్యలను పూర్వాచార పరాయణులగు దేశభక్తులు లేవనెత్తడంతో, కోర్టు తీర్పులవల్ల శ్రీ దేశముఖుగారి చట్టంద్వారా కలిగిన బహు స్వల్ప హక్కులుకూడా హరించి పోయాయి. ఈ పరిస్థితుల్లో 1941 లో హిందూ ధర్మశాస్త్రాన్ని 'కోడిఫై' చెయ్యడానికి బి. యన్. రావు కమిటీని ప్రభుత్వం నియమించడం జరిగింది. ఈ బి. యన్. రావు కమిటీ రిపోర్టు ఫలితంగానూ, స్త్రీల నిరంతర ఆందోళన ఫలితంగానూ హిందూ వారసత్వ చట్టం యీ సంవత్సరమే మే 10 వ తేదీన పార్లమెంటుచే అంగీకరించబడి జూన్ 17 వ తేదీ నుండి భారత న్యాయశాస్త్రంలో అంతర్భాగం అయి హిందూస్త్రీలకు కొన్ని ఆర్థిక హక్కులను కలుగజేసింది.

## మితాక్షరం - దాయభాగం

హిందూ ధర్మశాస్త్రంలో వారసత్వానికి సంబంధించినంత వరకూ మూడు ముఖ్యమైన పద్ధతు లున్నాయి. ఒకటి దాయభాగ పద్ధతి. ఈ పద్ధతి బెంగాలులో అమలులోవుంది. రెండవది మితాక్షర పద్ధతి. ఇది బెంగాల్, మళయాళ మినహా తక్కిన హిందూదేశంలో వ్యాప్తిలోవుంది. మూడవది మరుమ్మక్కతాయం, అలియసంతానం అనే పద్ధతులు మళయాళంలోనూ, దక్షిణ కనరాలోనూ అనుసరింపబడుతున్నాయి. మిగతా హిందూదేశంలోవలె కాకుండా యీ రెండుపద్ధతులు మాతృస్వామ్య పద్ధతిని అనుసరిస్తున్నాయి. అందుచేత స్త్రీలద్వారానే వంశక్రమం లెక్కించి వారసత్వంసంక్రమిస్తుంది. ఈ పద్ధతికూడా యిప్పుడు చట్టబద్ధం అయింది. ఈ పద్ధతులవల్ల స్త్రీలకూ, పురుషులకూ సమానహక్కులు కలుగుతున్నాయి. కూతుళ్ళతోపాటు కొడుకులు కూడా సమానమైన భాగాన్ని పంచుకుంటారు.

మన ఆంధ్రదేశంలో మితాక్షర న్యాయశాస్త్రాన్నే అనుసరిస్తున్నాం. ఈ పద్ధతిప్రకారం ఒక హిందూపురుషునియొక్క ఆస్తి రెండు రకాలు. ఒకటి పిత్రార్జితమైన ఆస్తి. అంటే తండ్రి తాతల నుంచీ వస్తూన్న ఆస్తి. దీన్నే జాయింటు కుటుంబ ఆస్తి అనికూడా అంటారు. వంశపారంపర్యా వస్తూన్నది కాబట్టి తండ్రితోపాటు కొడుకుకీ, కొడుకుకొడుకుకీ, కొడుకుకొడుకుకొడుకుకీ పుట్టుకతోనే వారసత్వపు హక్కు యేర్పడిపోతుంది. కొడుకులతోపాటు తండ్రికీ ఒక సమానవాటా మాత్రమే వుంటుంది. ఆస్తి కుటుంబానికంతకీ చెందినది అనడంచేత అవిభక్తంగా వున్నంతకాలము తండ్రి ధర్మకర్తగా వుండడం తప్ప వేరే ప్రత్యేకాధికారం యేదీ అతనికి లేదు. రెండోరకం ఆస్తి అతని స్వార్జితమైన ఆస్తి. తను వ్యక్తిగతంగా సంపాదించిన ఆస్తిగనుక దీనిమీద ఎవ్వరికీ ఎటువంటి హక్కు వుండదు. క్రయ దాన వినిమయాది అధికారాలన్నీ అతనివే. వీలు వ్రాసి తన యిష్టమైనవారికి యివ్వవచ్చు. వీలు వ్రాయకుండా చనిపోతే తన తదనంతరం తన దాయాదులకి సంక్రమిస్తుంది. తన స్వార్జితాన్ని తను బతికివున్నప్పుడు కూతుళ్లకు, భార్యకు, తల్లికియివ్వవచ్చు. లేకపోతే వీలువ్రాసి తన తదనంతరం వాళ్ళకి యివ్వవచ్చు. వీలునామా వ్రాయకుండా చనిపోతేమాత్రం దాయాదులకి పోతుందేకాని కూతురికికాని, భార్యకికాని, తల్లికికాని చెందదు. ఇక పిత్రార్జితపు ఆస్తిలో స్త్రీలకు క్రయ దాన వినిమయాధికారాలు కలిగిన వాటా రానేరాదు (క్రయం అంటే అమ్మడం, దానం అంటే వూరికినే యిచ్చివేయడం, వినిమయంఅంటే తనఖాపెట్టడం).

దాయభాగం పద్ధతి ప్రకారం పిత్రార్జితంకాని, స్వార్జితం కాని వారసులకే చెందుతుంది. తండ్రికి వారసులు కొడుకు, మనమడు, ముని మనమడు, వితంతువు భార్య. వీళ్ళెవ్వరూ లేని పక్షంలోనే కూతురికి చెందుతుంది.

## మితాక్షర పద్ధతి - స్త్రీకి పరిమితమైన ఆస్తి హక్కు

ఇప్పటివరకు వాడుకలోవున్న మితాక్షర పద్ధతిప్రకారము స్త్రీకి వారసత్వ హక్కు యించుమించు లేసేలేదని చెప్పవచ్చు. మన సమాజ వ్యవస్థలో స్త్రీకి ఆస్తి అంటూ వుండడం చాలా అరుదు. పెళ్ళి సమయంలో తల్లిదండ్రులు కాని, భర్త కుటుంబము వారు కాని పెట్టిన నగలు, నాణ్యాలు ఆమెపేర వ్రాసియిచ్చిన పొలము వుంటే యివి తప్ప ఆమెకు మరి వేరే ఆస్తి వుండడానికి అవకాశంలేదు. దీనికే స్త్రీధనం అంటారు. ఈ ఆస్తిపైనే ఆమెకు పూర్తి హక్కు వుంటుంది. అయినప్పటికీ సాధారణంగా భర్త బలవంతంవల్లనో, అత్తమామలు పెట్టే కోడండ్రికమునకు లొంగి పోయే యీ మాత్రపు ధనాన్నికూడా భర్తపేర వ్రాయించుకో వడం పరిపాటిగా మనం చూస్తూనే వున్నాము. ఈ స్త్రీధనంమీద ఆమెకు పూర్తి హక్కు వుండబట్టే దానిలోనే యీమాత్రం ఆమాత్రం తన కూతురిపేర యివ్వడానికి వీలవుతూంది. ఇది తప్పితే ఆమె తదనంతరం ఆ స్త్రీధనం ఎవరికేనా ఆమె వీలువ్రాసినప్పటి కిన్నీ, ఆమె వారసులకు దక్కకుండా దాయాదులు అనేక సమస్య లను లేవనెత్తి చేజిక్కించుకుంటున్నారు. స్త్రీధనం విషయంలో కూడా దేశం అంతటా వారసత్వపు పద్ధతులు ఒకేవిధంగా లేవు. అందుచేత పేరుకి స్త్రీధనంపై ఆమెకు పూర్తి క్రయదాన వినిమ యాధికారాలు వున్నప్పటికి ఆమె తదనంతరం ఆమె యిష్టప్రకారం జరగడంలేదు.

ఇక పెళ్ళికాని కూతురుసంగతి తండ్రి బతికివున్నప్పుడు తండ్రి దయతలచి యిస్తే వుంటుంది. లేకపోతే ఆమె యిబ్బందుల గురించి చెప్పనవసరమేలేదు. అన్నదమ్ములుంటే ఆమెకు జాయింటు కుటుంబ ఆస్తిలోనుంచి ఆమెకు పెళ్ళిచేసేవరకే వారి బాధ్యత. ఆపైన వారు పట్టించుకోరు. ఇక వితంతువైతే భర్త ఆస్తినుంచి కొంతజీవనభృతికిగాను స్వల్పంగా ఆస్తి యిస్తారు. ఆ

ఆ స్తైనా ఆమె బతికివున్నంతవరకూ అనుభవించేహక్కు తప్ప ఆ ఆస్తి పైన యేవిధమైన క్రయ దాన వినిమయ హక్కులూ లేవు. ఆ జీవన భృతికి యిచ్చిన ఆస్తికూడా మన సమాజ పరిస్థితులనుబట్టి బహు స్వల్పంగానే వుంటుంది. అది చాలీచాలకుండా వుండుటచేతనే ఆమె అత్తగారివద్దనో, మరదులవద్దనో చాకిరీ చేయుచు బతకవలసిందే. ఆ రవ్వంత ఆస్తికూడా ఆమె తదనంతరం భర్తదాయాదులకు సంక్రమిస్తుంది. అసలు ఆమె బతికివున్నప్పుడే ఈ పరిమితమైన హక్కునుకూడా వినియోగించుకోకుండా దాయాదులు అనేక రకములైన అల్లరులు, పెంపకం చేసుకోమని తగాదాలు పెట్టడం మనం సర్వత్రా చూస్తూనే వున్నాము. ఈ విధంగా స్త్రీలకు వారసత్వపు హక్కు లేకపోవడంచేతనే ఆమెకు ఆర్థికంగా ఏమాత్రం స్వతంత్రం లేక యితరులపోషణలో నిర్బంధంగావుండి అధ్వాన్నపు జీవనాన్ని గడుపుకోవలసివస్తుంది.

## హిందూ వారసత్వ చట్టం

మితాక్షరము, దాయభాగం అనే భేదం లేకుండా, స్థానిక దేశాచారములను లెక్కచేయకుండా యావత్తు భారతదేశంలో (జమ్మూ - కాశ్మీరు రాష్ట్రం మినహాయించి) ఒకేవిధమైన వారసత్వపు పద్ధతిని అమలులోకి తీసుకొనిరావడమే ఈ చట్టంయొక్క ఉద్దేశం. ఈ చట్టం హిందువులందరికీ లింగాయతులు, వీరశైవులు, బ్రహ్మసమాజికులు, ఆర్యసమాజికులు, ప్రార్థనసమాజికులు అనే విభేదాలు లేకుండా హిందువులకీ, బౌద్ధులకీ, జైనులకీ, సిక్కులకీ వర్తిస్తుంది. క్రిస్టియను, మహమ్మదీయ, పార్శీ, యూదు మతస్థులకు మాత్రము వర్తించదు.

చట్ట సమ్మతంగా కలిగిన సంతానమైనాసరే, చట్టవిరుద్ధమైన సంతానమైనాసరే తల్లిదండ్రులు యిద్దరూ హిందువులు, జైనులు, సిక్కులు, బౌద్ధులు అయితే ఆ సంతానానికి యీ చట్టం వర్తిస్తుంది. తల్లీదండ్రీ యిద్దరూ హిందువులు కాకపోయినాసరే, యిద్దరిలో ఒకరు హిందువై, పిల్లలు హిందువులలాగే పెంచబడితే

సంతానం హిందువులుగానే పరిగణింపబడతారు. హిందూమతానికి చెందకపోయినా హిందూమతస్థునిలాగే జీవనం గడుపుతూన్న ప్రతి వారికీ యీ చట్టం వర్తిస్తుంది.

జారత్వమువల్ల కలిగిన బిడ్డలు తల్లిబిడ్డలుగాను, వారిలో వారు అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళగాను భావించబడుతారు.

ఈ చట్టం అమలులోకి వచ్చిన తరువాత ఈ చట్టానికి విరుద్ధంగావున్న పాత చట్టాలుగాని, పాత వ్యాఖ్యానాలుగాని, పాత తీర్పులుగాని, పాత ఆచారాలు, సాంప్రదాయాలుగాని యికముందు చెల్లనేరవు.

హిందూ పురుషుడు, హిందూ స్త్రీ 1954 సంవత్సరపు ప్రత్యేక వివాహ చట్టంకింద పెళ్ళి చేసుకున్నట్లైతే వారికి యీ చట్టం అన్వయించదు. అట్టివారికి 1925 సం॥ ఇండియను సక్సేషను ఆక్టు వర్తిస్తుంది.

కొద్ది మార్పులతో యీ చట్టం యిదివరకు మరుమక్కతాయం, అలియసంతానం పద్ధతులను-అనగా మాతృస్వామ్య పద్ధతిలో వారసత్వం - అనుసరిస్తున్న మళయాళం, దక్షిణకనరా వాళ్ళకికూడా వర్తిస్తుంది.

## అవిభక్త కుటుంబ ఆస్తి - స్త్రీల హక్కు

ఒక హిందువు వీలునామా వ్రాయకుండా చనిపోయిన పక్షంలో అతని ఆస్తి యెవరికి చెందుతుందో యీ చట్టం నిర్ణయిస్తుంది. ఆ పురుషుని యొక్క జాయింటు కుటుంబ ఆస్తిలోవుండే తన వాటాను - అనగా పిత్రార్జితపు ఆస్తిలో వాటాకిన్ని, అతని యొక్క స్వార్జితానికిన్ని ఎవరు వారసులో యీ చట్టం నిర్ణయిస్తుంది.

ఒక హిందూ పురుషుడికి జాయింటు కుటుంబ ఆస్తిలో వాటా వుంది అనుకుందాం. అతను తను బతికివున్నప్పుడు వాటా పంచుకోలేదు. ఆతను వీలు వ్రాయకుండా చనిపోయాడు.

అప్పుడు అతనికి జాయింటు కుటుంబ ఆస్తిలో వాటా పంచుకోవడానికి హక్కు వుందా లేదా అనే మీమాంసలతో ఏవిధంగాకూడా ప్రసక్తి లేకుండా అతను జీవించివున్న ఆఖరు రోజున అతను 'నా భాగం నాకు పంచియివ్వండి' అని అడిగి పంచుకొని వుండినట్లైతే అతనికి ఎంత వాటా వచ్చివుండేదో - అతను చనిపోతే కూడా అతనికి సరిగ్గా అంత వాటా సంక్రమిస్తుంది అని నిర్వచనం చేయబడింది. ఇదివరకు అమలులో వుండిన హిందూ ధర్మశాస్త్ర ప్రకారం అతని పిత్రార్జితములో వాటా అతని కొడుకులకూ, కొడుకు కొడుకూ, కొడుకు కొడుకు కొడుకూ, వీరెవ్వరూ లేకపోతే దాయాదులకూ సంక్రమించేది. ఈ చట్టం అటువంటిదేవీ లేకుండా అతనికి ఎవరు దగ్గిర బంధువులు, అతనికి సామాన్యంగా ఎవరి మీద హెచ్చు ప్రేమ వుంటుంది అని నిర్ణయించి ఆ వారసుల జాబితాను ఒకదాన్ని తయారు చేశారు. ఆ జాబితా ప్రకారం అందులో పేర్కొన్న బంధువులందరికీ వాళ్ళు జీవించి వుంటే ఆ ఆస్తి సమాన భాగాలుగా ఒకే కాలంలో సంక్రమిస్తుంది. ఇదివరకు హిందూ ధర్మశాస్త్రం ప్రకారం పిత్రార్జితంలో హక్కు పితృ కర్మలని చేయడానికి అర్హత గల మొగ దాయాదులకే వుండేది. ఎంత దగ్గిర బంధువులైనా - భార్య అయినాసరే, కూతురైనాసరే తనను కన్నతల్లికైనాసరే - స్త్రీలకి చెందక కొడుకులు లేకపోతే ఎవరో ముక్కూముఖం ఎరగని దాయాదు లెవరేనావుంటే వెతికి గాలించి వాళ్ళకిపోయేది. ఇప్పుడు అలాకాకుండా, ఒక జాబితా తయారుచేసి, ఆ జాబితాలో చెప్పబడిన స్త్రీలుకాని, ఆ జాబితాలోనే చెప్పబడిన ఆ స్త్రీల బంధువర్గంగాని - వీరెవ్వరూ లేకపోతే అప్పుడే కొడుకుకిగాని, దాయాదులకిగాని సంక్రమిస్తుంది.

ఈ చట్టం ప్రకారం హిందూపురుషుని బంధువర్గాన్ని మొదటి తరగతివారసులు, రెండవతరగతి వారసులు అని రెండు తరగతులుగా నిర్ణయించారు. మొదటితరగతి వారసులు ఎవరంటే :— (1) కొడుకు, (2) కూతురు, (3) భార్య (వితంతువు), (4) తల్లి,

(5) ఇతనికంటె ముందే చనిపోయిన కొడుకు కొడుకు, (6) గతించిన కొడుకుకూతురు, (7) గతించినకూతురు కొడుకు, (8) గతించిన కూతురు కూతురు, (9) గతించిన కొడుకు వితంతువు (వితంతువుకోడలు), (10) గతించిన కొడుకుయొక్క గతించిన కొడుకు కొడుకు, (11) గతించిన కొడుకుయొక్క గతించిన కొడుకు కూతురు, (12) గతించిన కొడుకుయొక్క గతించిన కొడుకు వితంతువు.

అతని పిత్రార్జితపు భాగంలో ఈ పన్నెండుగురికి సమాన వాటాలు ఏకసమయమున సంక్రమిస్తాయి. అంటే ఈ జాబితాలో చెప్పిన స్త్రీలు కాని, ఆ స్త్రీలయొక్క మొగవారసులు కాని లేని పక్షమందే కొడుకులకుకాని, బతికివున్న దాయాదులకుగాని చెందుతుంది.

అనగా జాయింటు కుటుంబ ఆస్తులలో తండ్రియొక్క వాటా ఆస్తి కొడుకులతోపాటు కూతురికి, భార్య (వితంతువు)కి, తల్లికి, ముందు చనిపోయిన కొడుకు కూతురికి, ముందు చనిపోయిన కూతురు కూతురికి, వితంతువు కోడలికి, ముందు చనిపోయిన కొడుకు యొక్క ముందు చనిపోయిన కొడుకు కూతురికి, చనిపోయిన కొడుకుయొక్క కోడలికి సమానభాగాలు చెందుతాయి. అనగా స్త్రీలకు పురుషులతోపాటు సమానహక్కు సంక్రమించిందన్నమాట. ఈ చట్టంవల్ల, స్త్రీలకి జాయింటు కుటుంబ ఆస్తిలో తండ్రి వాటాలో హక్కు యేర్పడింది. ఇది ఒక గొప్పహక్కు.

అంతేకాదు. ఇదివరకటి పద్ధతి ప్రకారం స్త్రీకి తన జీవితకాలంలో ఆ ఆస్తిని అనుభవించడానికి మాత్రమే హక్కువుండేది. కాని అమ్ముకోడానికిగాని, మరి యేవిధంగాకూడా అన్యాక్రాంతం చెయ్యడానికిగాని వీలులేకుండా పరిమితమైన హక్కేవుండేది. ఆ ఆస్తి మీదవచ్చే ఆదాయానికే - ఆమె జీవనస్మృతికి మాత్రమే - ఆమెకు హక్కు. ఈ చట్టం వచ్చిన తరువాత స్త్రీకి జాయింటు కుటుంబంలోనుంచి తనకు సంక్రమించిన ఆస్తిపై పూర్తి దానదమన

హక్కులు దఖలు పడుతున్నాయి. ఇదికూడా చాలా గొప్ప విషయము.

## స్వార్జితము - వారసత్వము - స్త్రీలహక్కు

ఒక హిందూ పురుషుడు వీలు వ్రాయకుండా చనిపోయిన యెడల స్వార్జితపు ఆస్తికూడా మొదటి తరగతి వారసుల జాబితాలో వున్న వారందరూ వారసులే. అయితే జాయింటు కుటుంబ ఆస్తియొక్క తండ్రివాటాలో మొదటితరగతి వారసులందరికీ సమాన వాటాలు ఏకకాలమందే చెందుతాయి. స్వార్జితములో ఈ పన్నెండుగురి వారసుల మధ్య ఒక్కొక్కరికి ఎంతవాటా చెందుతుందో నిర్ణయించారు.

చనిపోయిన వానిభార్య (లేక ఎంతమంది భార్యలువుంటే అందరికీ కలిపి)కి, బతికి వున్న కొడుకులు, బతికివున్న కూతుళ్ళు, తల్లి, వీరందరికి ఒక్కొక్కరికి ఒక్కొక్క సమానభాగం. తండ్రికి ముందే చనిపోయిన కొడుకులుగాని, కూతుళ్ళుగాని వుంటే - వాళ్ళందరికీ కలిపి ఒక భాగం.

తండ్రికి ముందే చనిపోయిన కొడుకు వున్నప్పుడు - ఈ కొడుకుకు వచ్చే భాగంలో - ఆ కొడుకు యొక్క వితంతువుకి, బతికి వున్న కొడుకులకీ, కూతుళ్ళకీ చెరి ఒకభాగం, అతనికంటే ముందు చనిపోయిన కొడుకుల సంతానానికి అందరికీ కలిపి ఒకభాగం చెందుతుంది.

తండ్రికంటే ముందే చనిపోయిన కూతుళ్లువుంటే - వారికి రావలసిన ఒకభాగంలోనూ వారి బ్రతికివున్న కూతుళ్ళకీ, కొడుకులకీ సమానభాగాలు చెందుతాయి.

ఇక హిందూ పురుషుడు వీలు వ్రాయకుండా చనిపోయి, మొదటి జాబితాలో పన్నెండుగురు వారసులూకూడా లేకపోయిన పక్షంలో, రెండవ తరగతి వారసులు అని మరొకజాబితా తయారు చేశారు. ఆ రెండవ తరగతి వారసుల జాబితాలో తొమ్మిది శాఖలుగా విభజించారు.

# రెండవతరగతి వారసులు

శాఖ : 1. తండ్రి.

2. (i) కొడుకు కొడుకు; (ii) కొడుకు కూతురు; (iii) సోదరుడు; (iv) సోదరి.

3. (i) కూతురు కొడుకు కొడుకు; (ii) కూతురు కొడుకు కూతురు; (iii) కూతురు కూతురు కొడుకు; (iv) కూతురు కూతురు కూతురు.

4. (i) సోదరుడి కొడుకు; (ii) సోదరి కొడుకు; (iii) సోదరుడి కూతురు; (iv) సోదరి కూతురు.

5. తండ్రి తండ్రి; తండ్రి తల్లి.

6. తల్లి లేక సవతితల్లి; సోదరుడి వితంతువు.

7. తండ్రి అన్నదమ్ములు; తండ్రి అక్కచెల్లెళ్ళు.

8. తల్లి తండ్రి; తల్లి తల్లి.

9. తల్లి అన్నదమ్ములు; తల్లి అక్కచెల్లెళ్ళు.

ఈ పై తొమ్మిదిశాఖల్లోనూ వారసత్వపు హక్కు వరుస క్రమంగా వస్తుంది. అనగా పై శాఖలోని వారసులు లేనప్పుడే క్రిందిశాఖ వారసులకు ఆ విధంగా వరుస క్రమంగా వస్తుంది.

ఒక్కొక్క శాఖలో ఎంతమంది వుంటారో వారందరికి సమానవాటాలు లభిస్తాయి.

అనగా మొదటి జాబితాలోని వారికి, వారెవ్వరూ లేని యెడల రెండవజాబితా వారసులు, రెండవ జాబితా వారసులు కూడా లేనప్పుడు దాయాదులకీ, వారూ లేని పక్షమందు బంధువులకీ, వారుకూడా ఎవ్వరూ లేనియెడల చివరకి గవర్నమెంటుకీ దఖలు పడుతుంది.

అందుచేత ఈ చట్టంప్రకారం వీలునామా వ్రాయకుండా చనిపోయిన హిందువుడియొక్క చర స్థిరాస్తులలోభాగం అతనిపురుష వారసులతోసహా స్త్రీ వారసులలో అతని కూతురు, వితంతు

భార్య, తల్లి వీరికేకాకుండా, కొడుకు మనుమరాలికి, అక్క చెల్లెళ్ళకి, వారు లేకపోతే కూతురు సంతానానికి, వారు లేకపోతే అక్క-చెల్లెళ్ళ పిల్లలకి, అన్నదమ్ముల పిల్లలకి, వాళ్ళూ లేకపోతే బామ్మకి, తరువాత తల్లికి, వొదినగారికి, ఆ తరువాత మేనత్తకి, ఆ తరువాత మామ్మకి, ఆ తరువాత పినతల్లికి – వీరందరికీ వారసత్వపు హక్కు వుంది.

ఈ విధంగా స్త్రీకి సంక్రమించిన ఆస్తులలో ఆమెకు దాన క్రయ సత్వాధికారాలు పూర్తిగా వుంటాయి. ఏ విధంగానూ కూడా ఆమెహక్కు పరిమితంకాదు.

## స్త్రీల ఆస్తికి వారసులు

హిందూ స్త్రీకి స్త్రీధనం పైన పూర్తి హక్కు వున్నదని స్మృతులు, శాస్త్రాలుచెప్పినా, స్త్రీధనం అన్నపదాన్ని నిర్వచించడంలో కోర్టు తీర్పులుమాత్రం అనేకవిధాలుగా వుంటూ, అనేక తికమకలుపెట్టి అగమ్యగోచరంగా చేసివేశాయి. ఈ చట్టంలో ఆ చిక్కులన్నీ విడదీసి, స్త్రీకి యేవిధంగా సంక్రమించినాసరే స్వశక్తి సామర్థ్యాలవల్లకాని, వారసత్వంవల్లకాని, మనోవర్తి జీవనభృతికిగాని వీటి బకాయిల నిమిత్తం తీర్మానంచేసి యిచ్చిన ఆస్తిగాని, మరెవ్వరివల్ల బహుమానంగాకాని, కానుకగాకాని, పెళ్లిసమయమందుకాని, ఆ తరువాతకాని, 'స్త్రీధన' రూపంగాకాని,మరి యే యితరవిధంగా సంక్రమించిన ఆస్తికాని, ఆమెయొక్క దాన దమన సత్వాధికారాలతో సంపూర్ణహక్కు గల్గిన ఆమె స్వంత ఆస్తి అని నిర్వచనం చేశారు. ఈ విధంగా యీ చట్టం స్త్రీలకు ఒక కొత్తహక్కును కల్గించడమేకాకుండా, ఆ హక్కును నిలబెట్టుకోడానికి ఒక గొప్ప ఉపకారాన్నికూడా చేసింది.

హిందూ స్త్రీ వీలు వ్రాయకుండా చనిపోతే, ఆమె ఆస్తికి ఎవరు వారసులు అనే విషయాన్నికూడా యీ చట్టం నిష్కర్షగా తేల్చివేసింది. ఈ చట్టం ప్రకారం ఒక హిందూ స్త్రీ వీలునామా

వ్రాయకుండా చనిపోతే - ఆమె ఆస్తి యావత్తూ యీ క్రింది వార సులకు సంక్రమిస్తుంది.

1. కొడుకులు; కూతుళ్లు (ఆమెకు ముందే చనిపోయిన కొడుకు కాని, కూతురు కాని వుంటే వారి పిల్లలతో సహా); భర్త - వీరందరికీ సమాన వాటాలు.

2. వీరు లేనప్పుడు వీరి తరవాత భర్త వారసులకు.

3. పైవా రెవరూ లేనప్పుడు తల్లిదండ్రులు.

4. వీరుకూడా లేనప్పుడు తండ్రియొక్క వారసులు.

5. ఆఖరున వీరుకూడా లేనప్పుడు తల్లియొక్క వారసులు.

ఇక్కడ రెండు మినహాయింపులు మాత్రం వున్నాయి.

1. ఆ స్త్రీకి తన తల్లిదండ్రుల ఆస్తులలో యేదైనా భాగం సంక్రమించి వుంటే, ఆమెకు కొడుకులు, కూతుళ్ళు లేనిపక్షంలో ఆ ఆస్తి తండ్రి వారసులకే చెందుతుంది.

2. అదే విధంగా ఆమెకు భర్తనుండి యేదేనా ఆస్తి సంక్ర మించి వుంటే ఆమెకు సంతానంలేని పక్షమందు ఆ ఆస్తి భర్త వారసులకే చెందుతుంది.

మళయాళ దేశంలో మరుమక్కతాయం, దక్షిణ కనరాలో అలియ సంతానం - యీ రెండుపద్ధతులకూ వర్తించే సందర్భంలో వీలునామా వ్రాయకుండా చనిపోయిన స్త్రీయొక్క ఆస్తికి యీ క్రిందివాళ్ళు వరుసక్రమంగా వారసు లవుతారు :

1. మొదట కొడుకులు, కూతుళ్ళు (ఆమెకు ముందే చని పోయిన కొడుకుగాని, కూతురుగాని చనిపోతే మనుమలు, మనుమ రాండ్రు) ; తల్లి.

2. ఆ తరవాత తండ్రి; భర్త.

3. ఆ తరవాత తల్లి వారసులు.

4. ఆ తరవాత తండ్రి వారసులు.

5. ఇక ఆఖరున వీళ్ళెవ్వరూ లేకపోతే భర్త వారసులు.

# స్త్రీ దాయాదియొక్క హక్కు

ఇదివరకు మితాక్షర పద్ధతి ననుసరిస్తూ వచ్చిన కుటుంబం యొక్క పిత్రార్జితపు ఆస్తిలో స్త్రీలకుకూడా ఈ చట్టం దాయాది హక్కును కలిగిస్తూన్నదని యిదివరకే తెలుసుకున్నాం. ఇంతే కాకుండా, జాయింటు కుటుంబంలో పురుషసభ్యుడు చనిపోతే, అతను చనిపోకముందు అతడు కుటుంబంనుంచి విభక్తం కాక పోయినాసరే, అతనికి ఎంతవాటా అయితే రావలసివుంటుందో అంతవాటాకు పురుషులతో సమానంగా స్త్రీలుకూడా దాయభాగి నులు అయి, ఆ వాటాపై క్రయ దాన ధర్మ వినిమయ హక్కులు పూర్తిగా కలిగివుండే హక్కునుకూడా యీ చట్టం కల్పిస్తూందని తెలుసుకున్నాం. జాయింటు కుటుంబంయొక్క చరాస్తులలో కాని, వ్యాపారంలోకాని పురుషుడికేనా, స్త్రీకేనా మిగతా దాయాదులతో కలిసి జాయింటు హక్కుతో సంక్రమించిన యెడల, ఆ భూమి ముక్కచెక్కలై పోకుండాను, ఆ వ్యాపారం చెడిపోకుండాను కాపాడడానికి దాయాదులకుగల అమ్ముకునే హక్కును కొంత పరిమితం చేశారు. భూమిలోగాని, పొలంలో గాని, వ్యాపారంలోగాని, తన వాటాను అమ్మకోదలచినప్పుడు అన్యాక్రాంతం చేయదలచినప్పుడు, ఆలాగు అమ్మదలచినవారు మొదట తనతో కూడా మొదటి వారసుల జాబితాలో వుండి, ఆ స్తిలో వాటగల మిగిలిన దాయాదులకు నిర్బంధంగా అమ్మే జూపాలి. వీరు కొనుటకుకాని యిష్టపడనియెడలనే బైటవారికి అమ్ము కోడానికి వీలవుతుంది.

ఈ సందర్భంలో జాయింటు ఆస్తి భూకమతంగాని, పొలం గాని అయినప్పుడు స్త్రీకి యిందులో వారసత్వపు హక్కు వుండ కూడదు అనేవాదం దేశంలోనూ, పార్లమెంటులోనూ లేవదీయ బడింది. ఇది ఒక బ్రహ్మాండమైన సమస్యగా చిత్రించి భూకమ తాలు ముక్కముక్కలుగా చీలిపోయి వ్యవసాయం నాశనం అయిపోయి, దేశారిష్టానికే దారితీస్తుందని చాలా ఆందోళన

సాగింది. కాని యిందుకు సంబంధించిన వాదనలను పార్లమెంటు కాని, ప్రజాభిప్రాయం కాని అంగీకరించక పురుషులతో పాటు సమానమయిన హక్కునే స్త్రీలకు కూడా కలుగజేశారు. అయితే - పురుషుడైన దాయాది అని, స్త్రీదాయాది అని విచక్షత చూపించకుండా, భూకమతం చీలికలైపోకుండా కాపాడేందుకు గాను యే పద్ధతులేనా సరే - పొలాలు ముక్కలుకాకుండా వుండేందుకు కనిష్ఠ పరిమితినిగాని, భూకమతాలకు గరిష్ఠ పరిమితి కాని, లేక రైతువారీ విధానంలో మార్పుకుకాని యే దేనా పద్ధతులను పార్లమెంటు ఉత్తరోత్తరా అమలులో పెట్టినట్లైతే - అట్టి పద్ధతులకు యీ హక్కు ప్రతిబంధకంగా వుండకూడదు అని మాత్రం ఒక రక్షణ కల్పించారు.

## వంశ పారంపర్యంగావున్న కాపురపుయింట్లో స్త్రీ వారసురాలిహక్కు

స్థిరాస్తిఅయిన భూమిలోకాని, వ్యాపారంలోకాని స్త్రీకి యేవిధంగానైతే భాగం సంక్రమించవచ్చో, ఆలాగే స్థిరాస్తి అయిన కాపురంయింట్లోని వాటాకుకూడా స్త్రీ వారసురాలికి హక్కు కల్పించబడింది. అయితే, యీ సందర్భంలోమాత్రం స్త్రీయొక్క హక్కుకి కొంత పరిమితం కలుగజేయబడింది.

కాపురపు యింట్లోని వాటా స్త్రీవారసురాలికి సంక్రమించిన యెడల ఆ కాపురపు యిల్లు తండ్రిద్వారాకాని, తల్లిద్వారాకాని మరి యెవరివల్లకాని వీలునామా వ్రాయకుండా చనిపోయినసందర్భములో - మొదటి జాబితాలో వివరించిన వారసులెవరేనా ఆమెతో జాయింటువారసులైనప్పుడున్నూ, ఆ కాపురపుయింటి అంతటిలోనూ చనిపోయిన వ్యక్తియొక్క కుటుంబంవారు నివసిస్తూన్నప్పుడున్నూ, స్త్రీ వారసురాలు ఆ కాపురపు యింట్లోభాగాన్ని పంచిపెట్టియివ్వమని అడగడానికి హక్కులేదు. ఆ కాపురపు యింటిలో ఆమెతో కూడా వాటాలుగల మొదటిజాబితాలో వివరించిన యితర మొగ బంధువులు అందరూ ఎప్పుడు ఆయింటిని పంచుకుంటే అప్పుడే ఆమెకు

కూడా వాటా పంచియిస్తారు. అంతవరకు ఆమె నోరు మెదపడానికి వీలులేదు. ఈ మేరవరకు స్త్రీ వారసురాలి హక్కును పరిమితం చేసినా, ఒక రక్షణ మాత్రం కల్గించబడింది. ఆ స్త్రీ వారసురాండ్రకు యింట్లో నివసించేటందుకు హక్కుమాత్రం ఎక్కడికీపోదు.

అంతేకాదు; ఈ వారసురాలు కూతురే అయినప్పుడు, యీమెకి పెళ్లై తన భర్తతో సంసారం చేసుకుంటూన్నప్పుడు, తాను యీ యింటిలో భాగానికి వారసురాలైనా, ఆ యింటిలో తన భర్తతో ప్రవేశించి కాపురం చెయ్యడానికి వీలులేదు. అయితే - ఆ వారసురాలు అవివాహిత అయినప్పుడు, లేదా ఆమె భర్త ఆమెని వదలిపెట్టేసినప్పుడు, లేక ఆమె భర్త నుండి వేరైపోయినప్పుడు, లేక వితంతువైనప్పుడు ఆ యింట్లో నివసించే హక్కును కలిగివుంటుంది. ఈ విషయంలో మాత్రం భర్తతో కాపురం చేస్తూన్న కూతురికి, తన తల్లిదండ్రుల యింట్లో వాటా హక్కును కలిగిన వారసురాలై వుండిన్నీ, తన భర్తతో కలిసి ఆ యింట్లో కాపురంచేసే హక్కు లేకపోవడం, అందుతోపాటు తన భాగాన్ని పంచియివ్వమని అడగడానికి హక్కులేకపోవడం కొంతవరకు స్త్రీలకు అన్యాయమే అని చెప్పాలి. ఈ హక్కు పరిమితంగా వున్నంతకాలం కుమార్తెకు కొంత నగదు ముదరా యివ్వడము న్యాయము. ఈ విషయమే శ్రీమతి రేణూ చక్రవర్తి పార్లమెంటు దృష్టికి తీసుకువచ్చింది. ఆమె సూచించినట్టు చట్టం మార్పుచెయ్యడం అవసరం.

ఒక హిందూ పురుషుడు చనిపోయిన యెడల, అతడు చనిపోయిన నాటికి వితంతువైన కోడలు, చనిపోయిన కొడుకు, కొడుకుయొక్క వితంతువు, తమ్ముని యొక్క వితంతువు - వీళ్ళ ముగ్గురిలో ఎవ్వరైనా పునర్వివాహం చేసుకొని వుంటే వాళ్ళు వారసులుగా పరిగణింపబడరు. సాధారణంగా వితంతువుకి భర్త యొక్క ఆస్తి సంక్రమించి ఆమె అనుభవిస్తూన్నప్పుడు, ఆమె నడవడిక బాగు లేదని నీలాపనిందవేసి, ఆసాకుమీద ఆమెనుండి ఆస్తిని కాజేయ

డానికి, ఆమెను కోర్టులకు యీడ్చడం అప్పుడప్పుడు జరుగుతూండడం కద్దు. ఈ చట్టంలో ఆమె ప్రవర్తన గురించి యే విధమైన ప్రసక్తి లేకుండా, ఆస్తిదారుడు చనిపోయేనాటికి ఆమె పునర్వివాహం చేసుకోకుండా వుంటే వారసత్వానికి ఆమెకు పూర్తి హక్కు వుంటుంది.

ఈ చట్టంలో మరి ఒక ముఖ్యమైన విషయంకూడా గమనింపదగి వుంది. హిందూ వారసత్వపు అనర్హతలను తొలగించే చట్టం (1928) క్రింద పుట్టు అపసంతులూ, వెర్రివారూ వారసత్వానికి అనర్హులని చెప్పబడింది. ఈ చట్టంలో జబ్బువాళ్ళు, వికలాంగులు, అంగవైకల్యం కలిగినవారు - వీళ్ళకి కూడా వారసత్వపు హక్కు వుందని శాసించారు.

## ఆస్తికి వీలునామా

ఈ చట్టం ప్రకారం ప్రతి హిందువుడికీ తన జీవితానంతరం తన ఆస్తిని గురించి తన కిష్టమైనరీతిగా ఏర్పాటుచేసుకొనేందుకు వీలునామా వ్రాయడానికి పూర్తి హక్కు వుంది. జాయింటు కుటుంబంనుంచి వేరుపడకపోయినా, తన వాటాగురించి కూడా వీలు వ్రాయడానికి హక్కును యీ చట్టం కలిగిస్తూంది. ఈ చట్టం చేయబడకముందు జాయింటు కుటుంబంలోని తన వాటా గురించి వీలునామా వ్రాయడానికి అధికారం వుండేది కాదు. ఈ హక్కు యిప్పుడు కొత్తగా కల్పించబడింది. ఈ హక్కును కలిగించడంతో ఆస్తిదారుని భార్యకు, పెళ్ళికాని కూతుళ్ళకు, మైనరు పిల్లలకు కొంత అన్యాయం జరగడానికి అవకాశం వుండవచ్చు. ఒక పురుషుడు తనవల్ల పోషింపబడవలసిన వ్యక్తులు వుంటూన్నప్పుడు, తన ఆస్తిని యితరులకు దానంచేసి యిచ్చి వేయడానికి ఈచట్టంవల్ల ఎట్టి అభ్యంతరం వుండదు. ఆ ఆస్తిలో ఎంతో కొంతభాగం భార్యకు, పిల్లలకు, వాళ్ళపోషణకు, చదువులకిచ్చి మిగతా ఆస్తినే మరెవరికేనా ధారాదత్తం చేయడానికి హక్కు యిచ్చివుంటే, అతనిమీద ఆధారపడవలసిన భార్యాబిడ్డలకు అన్యాయం జరగదు. ఈ విషయ



ములో తగురంలన చట్టాన్ని కొంతమార్పు చేయడం అవసరమేమో అని తోస్తూంది.

అయితే, అందు విషయమై ఒక రక్షణ కల్పించబడింది. ఆ ఆస్తిదారుని వారసులలో ఎవరికైనా మనోవర్తి హక్కువున్నట్టయితే, ఆ వీలునామా ద్వారా ఆస్తిరాకుండా చేసినయెడల వారికి ఆస్తి సంక్రమించక పోయినా, మనోవర్తిహక్కు మాత్రం పోదు. ఆ ఆస్తిదారుడు వీలునామా వ్రాయకుండా చనిపోయిన యెడల, ఎవరెవరికైతే ఆస్తి సంక్రమించి వుండేదో, అలాంటి వ్యక్తులందరికీ వీలునామావల్ల ఆస్తి చెందకుండా అన్యాక్రాంతం అయినా, మనోవర్తి హక్కుమాత్రం ఎప్పటివలెనే వుంటుంది. ఆ వీలుద్వారా ఎవరికైతే ఆస్తి చెందుతుందో ఆ కొత్త ఆస్తిదారుడు వీరందరి మనోవర్తికి ఏర్పాటు చేయవలసిన బాధ్యత వున్నది.

## స్త్రీ వారసత్వపు హక్కులు - సమీక్ష

ఇప్పుడు కొత్తగా అమలులోకి వచ్చిన హిందూ వారసత్వ చట్టములోని ముఖ్యమైన విషయాలను మనం స్థూలంగా తెలుసుకున్నాం. ఈ చట్టంవల్ల స్త్రీలకు కొత్తగా సంక్రమించిన హక్కులు మూడు. మొదటిది: వీలునామా వ్రాయకుండా, ఒక హిందూ పురుషుడు చనిపోయిన యెడల అతని స్వార్జితపు ఆస్తిలో - తల్లికి, వితంతువుకు, కొడుకులకు, కూతుళ్ళకు సమానభాగాలు వస్తాయి. రెండవది: స్త్రీకి వారసత్వంవల్ల సంక్రమించిన స్థిరచరాస్తులమీద- ఇదివరకటిలాగు జీవిత పర్యంతం అనుభవించే హక్కుకాకుండా - దాన దమన వినిమయ సర్వసంపూర్ణాధికారాలు - పురుషులకువలెనే కలుగజేయబడ్డాయి. ఈ పూర్తిహక్కు యీ చట్టం తరువాత సంక్రమించిన ఆస్తికే కాకుండా యిదివరకు సంక్రమించిన ఆస్తికికూడా వర్తిస్తుంది. మూడవది: తండ్రియింటిలో కూతురికి వాటావస్తుంది.

ఈ చట్టంద్వారా స్త్రీలకు కలిగిన హక్కుల ఫలితంగా హిందూసమాజం విచ్ఛిన్నం కాగలదని కొందరు పూర్వాచార పరాయణులు భయం చెందుచున్నారు. హిందూసంస్కృతి

పాశ్చాత్య నాగరికతయొక్క మాయ వ్యామోహాలకు లోబడి పోయి, నాశనం చెందుతుందని మిక్కిలి వాపోవుచున్నారు. ఎంత స్వల్పమైన సంస్కరణలను ప్రవేశపెట్టినప్పటికీ యీ ఛాందసులు మహావిప్లవం వెంటాడుతున్నట్లే గగ్గోలుపెట్టడం మామూలు. ఈ హక్కులు స్త్రీలకు కలిగించడంవల్ల సమిష్టి కుటుంబవ్యవస్థకు స్వస్తి చెప్పడమే అనిన్నీ, అందుమూలముగా పవిత్రమైన హిందూమతా నికే తీరని అపచారం కలుగుతుందనీ వీరు అనవసరంగా ఆందోళన పడుతున్నారు.

ఈ చట్టంలో అట్టి చిహ్నాలు లేవు సరికదా - సమిష్టి కుటుం బాన్ని నిలబెట్టడానికి దోహదంచేసే పరిస్థితులనే యీ చట్టం కల్పి స్తూంది. సమిష్టి కుటుంబపు స్థిరాస్తులనుగాని, కుటుంబవ్యాపారాన్ని గాని అమ్ముకొనేటప్పుడు ముందుగా తోటివారసులకు నిర్బంధంగా అమ్మజూపవలెననీ, వారు కొనడానికి యిష్టపడనప్పుడే యితరులకు అమ్మకంచేయాలనీ నిబంధనలు చేయడంచేత సమిష్టి కుటుంబం విడి పోవకపోవడమే కాకుండా, మరింత స్థిరపడి కుటుంబ ఆస్తులు మరింత గట్టిపడతాయి. స్త్రీ వారసురాలు కాపురపు యింట్లో భాగాన్ని పంచిపెట్టమని కోరినప్పటికీ, మగ వారసులందరూ ఎప్పుడు ఆ యింటిని పంచుకుంటారో అప్పటికికాని ఆమెకి వాటాను పంచియివ్వరు. అంతవరకూ యిల్లు ఉమ్మడిగా వుండవలసినదే. ఒకసారి కొడుకు పంచుకొని కుటుంబంనుంచి వేరుపడిపోతే, అతడు తిరిగి కుటుంబంలోచేరినా జాయింటు ఆస్తిలో హక్కు తిరిగి ఏర్పడదు. అందుచేత ఎవరుకూడా తొందరపడి సమిష్టి కుటుంబంలోనుంచి విడిపోయే ప్రమాదం సంభవించదు. ఇలాంటి పద్ధతులను అమలు లోకి తీసుకురావడంచేత సమిష్టి కుటుంబజీవనం మరికొంతకాలము పాటు నిలబడుటకు అవకాశము వుంటుంది.

## తండ్రి ఆస్తిలో కుమార్తెకు వాటా

తండ్రి వీలునామా వ్రాయకుండా చనిపోతే అతని యావ దాస్తి (అనగా జాయింటు కుటుంబ ఆస్తిలో అతని వాటాయున్నూ,

తని స్వార్జితమున్ను) యీ చట్టం ప్రకారము కుమారునితో పాటు కుమార్తెకు సమానభాగం వస్తుందని యిదివరకు చెప్పాను. అందుకు ఉదాహరణ:

ఒక పురుషుడు, అతని భార్య, కుమారుడు, కుమార్తె, తండ్రి, తల్లి, చనిపోయిన కుమారుని కుమారుడు (మనుమడు), చనిపోయిన కుమార్తె కుమార్తె (మనుమరాలు) వున్నారనుకుందాం. ఆ వ్యక్తి వీలునామా వ్రాయకుండా చనిపోతే అతని యావదాస్తిని యీ క్రింది విధంగా పంపకం చేస్తారు:

1. ఒక భాగం అతని వితంతువుకు,
2. ఒక భాగం అతని కుమారునికి,
3. ఒక భాగం అతని కుమార్తెకు,
4. ఒక భాగం అతని తల్లికి,
5. ఒక భాగంలో చనిపోయిన కుమారుని కుమారునికి (మనుమనికి), చనిపోయిన కుమార్తె కుమార్తెకు (మనుమరాలికి) చెరిసగం వాటా. తండ్రి రెండవ తరగతిలోని వారసుడు కాబట్టి, మొదటి తరగతి వారసులు జీవించియున్నారు కాబట్టి తండ్రికి కుమారుని ఆస్తిలో భాగం సంక్రమించదు. ఆస్తి సంక్రమించిన స్త్రీలందరికీ వారి వారి వాటాలపై పూర్తి దాన దమన విక్రయ హక్కులు వుంటాయి.

జాయింటు కుటుంబంలోని వాటాదారుడు తన వీలునామాలో తనకు యిష్టంలేనిఖర్చులను జాయింటు ఆస్తినుండి ఖర్చుచేసిన యెడల ఆ ఖర్చు వెచ్చాలకు తన ఆస్తికి బాధ్యత లేదనికూడా వ్రాయవచ్చు. ఈ కారణంచే యెవ్వరూ అనాలోచితంగా సమిష్టి ఆస్తిలోంచి అనవసరమైన ఖర్చులనుపెట్టి పాడుచేయరు. ఒకవ్యక్తి వీలునామా వ్రాయకుండా చనిపోయినప్పటికీ, తనకు దగ్గర సంబంధంగల స్త్రీ వారసులు లేని యెడల మితాక్షర పద్ధతి ప్రకారమే అతని జాయింటువాటా దాయాదులకు చెందుతుంది కాని, యీ చట్టం ప్రకారం చెందదు అని స్పష్టంగా నిర్వచించబడింది. అంతేకాదు.

జాయింటు కుటుంబములో సభ్యుడు ఎవరైనా సరే తన వా
తన ఇచ్ఛవచ్చిన వారికి వీలుౘ్రాసి ధారాదత్తం చేయవచ్చున
కూడా వుంది. తన కిష్టంలేనియెడల కూతుళ్ళకుగాని, భార్యకుగాని
తన జాయింటువాటాలో భాగం సంక్రమించకూడదు అని కూడా
వ్రాయడానికి యీ చట్టంలో ఎట్టి ప్రతిబంధకమూ లేదు.

ఈ చట్టంవల్ల స్త్రీలకు కలిగిన హక్కులు చాలా ముఖ్యమే అయినప్పటికీ, జాయింటు కుటుంబంలో తన తండ్రివాటాలో భాగము సగుమాత్రమే హక్కు వుండుటవల్లనూ, కొడుకులకు జాయింటు ఆస్తిలోకూడా అదనంగా వాటావుండుటచేతనూ, కొడుకులకంటే కూతుళ్ళకు చాలా తక్కువఆస్తే వస్తూంది. కొడుకులతో కూతుళ్ళకు ఏవిధంగానూ సమానమైన వారసత్వపు హక్కు కలుగలేదు. హిందూకోడ్ బిల్లు చిత్తుచట్టంప్రకారం దాయభాగ పద్ధతినే అనుసరించి వుండినట్లైతే-కూతురికి యిప్పుడు అమలులోకి వచ్చినట్టు కొద్దివంతుమాత్రమేకాక-దాయభాగపద్ధతి ప్రకారం పూర్తివంతు వచ్చివుండేది. కూతురికి జన్మతఃతండ్రి ఆస్తిలో హక్కురాలేదు. ఇదీకాక-తండ్రి ఆస్తిలోకూడా కూతురికి భాగంకోరడానికి సుతరామూ హక్కు కలిగించబడలేదు. తండ్రి వీలునామా వ్రాయకుండా చనిపోతేనే ఆమె అన్నదమ్ములతోపాటు వారసురాలు అవుతుంది. అందుచేత ఆస్తిలో జన్మతః హక్కునుకూడా స్త్రీలు ఆందోళనచేసి సంపాదించుకోవలసి వుంటుంది.

ఈ చట్టంవలన కలిగిన హక్కులలో మరియొక విషయము ముఖ్యంగా గమనించాలి. హిందూ వితంతు పునర్వివాహచట్టం ప్రకారం, హిందూ వితంతువు తిరిగి వివాహం చేసుకొన్నయెడల, మొదటి భర్తద్వారా ఆమెకు సంక్రమించిన ఆస్తిపై హక్కు చెల్లక, మొదటిభర్త వారసులకే తిరిగి దఖలుపడిపోతాయి. ఆ చట్టం చేసినప్పుడు స్త్రీకి ఆస్తిపై జీవితపు హక్కుమాత్రమే వుండేది. ఇప్పుడు అమలులోకి వచ్చిన హిందూ వారసత్వచట్టం ప్రకారం భర్త ఆస్తిలో వితంతువుకు కొడుకు, కూతురు, అత్త

రు - వీరితోసహా సమానభాగం వస్తుంది. వితంతువునకు ఈ
ంగా సంక్రమించిన ఆస్తిపై సంపూర్ణమైన హక్కులున్నాయి.
వితంతువుకు యీ విధంగా ఆస్తి దఖలుపడిన తరువాత, ఆమె
రిగి వివాహం చేసుకొన్నప్పటికీ, తన మొదటి భర్తద్వారా
ంక్రమించిన ఆస్తిపై ఆమె హక్కులు యే విధముగాను రద్దు
కాకుండా ఆమెకే పూర్తిగా నిలిచివుంటాయి. ఆ విధంగా
ఆమెకు మొదటి భర్తద్వారా సంక్రమించిన ఆస్తికి యేమాత్రం
భంగంరాదు. (శ్రీ ఎమ్. కృష్ణారావుగారిచే రచించబడిన "హిందూ
వారసత్వ చట్టం" అనే వ్యాసం; ఆంధ్ర లాటైమ్సు- 16-8-'56,
పుట 97).

## చట్టంలో కొన్ని లోపాలు

స్త్రీల హక్కుల దృష్ట్యా యీ చట్టంలోవున్న కొన్నిలోపా
లను పైన సూచించాను. ఈచట్టంలోవున్న వారసత్వపుజాబితాలో
తల్లి మొదటితరగతి వారసుల క్రింద చేర్చబడి, తండ్రి రెండవ
తరగతి వారసులలో చేర్చుట జరిగింది. ఈ విధంగా తల్లితండ్రుల
మధ్య వివక్షత చూపబడింది. కుమారుని ఆస్తిలో తండ్రి కంటె
తల్లికి హెచ్చు కల్పించబడింది. ఈవిధంగా తల్లికి తండ్రికంటె
హెచ్చు హక్కును కలిగించడం న్యాయంగా లేదని మన దేశంలో
చాలామంది స్త్రీలు అభిప్రాయ పడుతున్నారు. స్త్రీకి ఒకసారి
బిడ్డగాను, మరొకసారి వితంతువుగాను ఆస్తులు సంక్రమిస్తున్నాయి.
మరొకసారి తల్లిగా, చనిపోయిన తన కుమారుని ఆస్తిలో భాగాన్ని
పంచి యివ్వడం, చనిపోయిన వ్యక్తియొక్క సంతానానికి అన్యా
యం చేయటమేనని భావించబడుతోంది. ఈవిధంగా తల్లికి
కుమారుని ఆస్తిలో కూడా హక్కును కలిగించినందువల్ల కుమా
రులకు, కుమార్తెలకు వచ్చే వాటాలు తగ్గిపోయి వారికి అన్యాయం
జరుగుతోంది. ఈ విషయం పార్లమెంటుయొక్క జాయింటుకమిటీ
రిపోర్టులో శ్రీమతులు రేణూచక్రవర్తి,పార్వతీకృష్ణన్, శ్రీఎస్.వి.ఎల్.
రసింహంగార్లు తమ మైనారిటీ నివేదికలోనూ, శ్రీమతి సీతా

పరమానంద్ ఆమె మైనారిటీ నివేదికలోనూ సూచించి, తల్లి
కూడాతండ్రితో సమానంగా రెండవతరగతి వారసులజాబితాలో
చేర్చమని కోరాడు. పార్లమెంటులోకూడా యీ విషయమై చర్చ
చాలా జరిగినా చివరకు తండ్రిని రెండవ తరగతి జాబితాలో
వుంచి, తల్లిని మొదటితరగతి జాబితాలో ఖాయపరచుట
నిశ్చయించారు. ఈ విషయంలోకూడా చట్టాన్ని సవరణచేసి
తండ్రితోపాటు తల్లినికూడా రెండవ జాబితా వారసులలో
చేర్చొనుట న్యాయమని చాలామంది స్త్రీలు, పురుషులు భావించు
తున్నారు.

మరియొక ముఖ్యమైన విషయంలోకూడా యీ చట్టాన్ని సవరణచేయుట మిక్కిలి అవసరం. హిందూస్త్రీ వీలునామా వ్రాయకుండా చనిపోయినప్పుడు ఆమె వితంతువై ఆమెకు సంతానం లేనప్పుడు ఆమె ఆస్తి ఆమె తల్లిదండ్రులకు చెందకుండా భర్త వారసులకే చెందుతుందని యీ చట్టంలో నిర్ణయించబడింది. పిల్లలు, భర్తలేనప్పుడు ఆమెను కని, పెంచి, ప్రేమించిన తల్లిదండ్రులకు ఆమె ఆస్తి సంక్రమించుట న్యాయం - ధర్మం. అలాకాకుండా భర్త వారసులకు చెందుట అన్యాయం. అందుచేత చిత్తుచట్టంలోవున్న వరుసక్రమం ప్రకారమే, ముందు కుమారుడు కుమార్తె భర్తకున్ను, వీరు లేనియెడల తల్లితండ్రులకు, వీరు లేనియెడల తండ్రి వారసులకు వీరు లేనియెడల తల్లివారసులకు వీరెవ్వరూ లేనియెడల మాత్రమే భర్తవారసులకు సంక్రమించేలాగు సవరణచేయడం చాలా అవసరం.

అనేక సంవత్సరాలుగా భారత స్త్రీల ఆందోళన ఫలితంగా యీ చట్టంవల్ల కలిగిన కొత్తహక్కులు హిందూస్త్రీల ఆర్థికస్థితిని కొంతవరకు చక్కబరుస్తాయి. ఇది చాలా సంతోషకరమైన విషయం. కాని, అభ్యుదయకరములైన ప్రజాశక్తులతోపాటు మహిళాలోకంకూడా యీహక్కులను అప్రమత్తతతో కాపాడుకొనవలసి వుంటుంది. శ్రీ దేశముఖ్‌గారి హిందూస్త్రీల వారసత్వపు చట్టం

1937 లో అమలులోకి వచ్చినప్పటికీ, ఆ చట్టం భూకమతాలకు సంబంధించినదని, అట్టి వ్యవసాయ విషయాలలో చట్టములను చేయుటకు రాష్ట్ర శాసనసభలకే. కాని కేంద్ర శాసనసభకు అధికారంలేదని కోర్టుతీర్పులు వచ్చుటచేత, ఆ చట్టంవల్ల వ్యవసాయపు భూముల వారసత్వంలో స్త్రీలకు కలిగిన హక్కులను అమలుపెట్టుటలో అభ్యంతరం కలిగింది. ఆ అభ్యంతరాన్ని తీసివేయడానికి శ్రీమతి జాస్తి సీతామహాలక్ష్మమ్మగారు ఉమ్మడి మద్రాసు శాసనసభలో సవరణ ప్రవేశపెట్టడానికి ప్రయత్నించినా ఆ ప్రయత్నం సఫలీకృతం కాలేదు. ఇప్పుడు కొత్తగా అమలులోకి వచ్చిన హిందూ వారసత్వచట్టంకూడా వ్యవసాయపు విషయాల్లో కేంద్ర పార్లమెంటు భారత రాజ్యాంగ ప్రణాళికకు వ్యతిరేకంగా రాష్ట్రాలకు పూర్తి అధికారంగల విషయంలో జోక్యం కలుగజేసుకున్నదిగనుక యీ చట్టం రాజ్యాంగానికే విరుద్ధం అని అప్పుడే వాదనలు వినవస్తున్నాయి. అందుచేత స్త్రీలు, అభివృద్ధికాముకులు తగు జాగ్రత్తను వహించవలసి వుంటుంది.

స్త్రీల ఆర్థికస్థితి చక్కబడాలంటే, మరికొన్ని చట్టాలను చేయవలసిన అవసరం యెంతైనా వుంది. మన ఆంధ్రదేశంలో వరకట్నాల విధానంవల్ల కలుగుతూన్న అనర్థం, దుఃఖం ఇంతంత అని చెప్పడానికి వీలులేకుండా వున్నది. ఈ వరకట్నాల పద్ధతి రోజురోజుకూ మరింత ప్రమాద భరితంగా తయారవుతూండడం చాలా విచారించవలసిన విషయం. ఈ వరకట్నాలను నిషేధిస్తూ శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు మన రాష్ట్ర శాసనసభలో ప్రవేశపెట్టిన బిల్లును సమర్థిస్తూ, స్త్రీలు, పురుషులు కూడా తీవ్రమైన ఆందోళనచేసి, యీ దురాచారాన్ని శాసనంద్వారా రూపుమాపడం ఎంతేనా అవసరం.

వివాహ విషయంలోనూ, వారసత్వం విషయంలోనూ స్వరాజ్యస్థాపన తరువాత స్త్రీలకు కొన్ని కొత్త హక్కులు కలగడం చాలా సంతోషించవలసిన విషయం. అయితే స్త్రీల హక్కుల

దృష్ట్యా, దేశాభివృద్ధి దృష్ట్యా పూర్వకాలపు ఉద్దేశాలు, సాంప్రదాయాలు యింకా ఎంత బలంగా నాటుకొని వున్నవో మనం గ్రహించవలసివుంది. నిజమైన సోషలిస్టు నిర్మాణానికి పురుషులతో పాటు స్త్రీలకు సమాన ప్రతిపత్తిని కలిగించడమే కాకుండా, స్త్రీ సహజ శీలానికి, మాతృత్వానికి సంపూర్ణంగా దోహదంచేసే పరిస్థితులను కల్పించడంకూడ యెంత ఆవశ్యకమో వేరే పేర్కొననవసరంలేదు. అట్టి చక్కని పరిస్థితులను సాధించినప్పుడే నిజమైన సోషలిస్టు వ్యవస్థను మనదేశంలో స్థాపించగలుగుతాం.







## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA119B152 |
| పుస్తకం పేరు | వివాహం, వారసత్వం స్త్రీల హక్కులు |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 65 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 4 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | Rehana |
| స్కాన్ చేసినది | Aswini |
| పరీక్ష చేసినది | PRATHYUSHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | |